


# అంకితం

నిరుద్యోగి రాక్షసికి బలైపోతున్న
అభాగ్యులకు

రచయిత.

# నిరుద్యోగి

(నాటకం)

కొడాలి గోపాలరావు

నవయుగ పబ్లిషింగ్ హౌస్
బ్రాడీపేట - గుంటూరు.

ప్రథమ ముద్రణ
ఏప్రియల్ 1954.



ఒక రూపాయి



లక్ష్మీ ఆర్టు ప్రింటర్సు,
గుంటూరు.

# నా ఆశయం

"మళ్ళీ మీరు ఏం కొత్త నాటకం వ్రాస్తున్నారు?" అని మిత్రులు ప్రశ్నించినప్పుడు ఏం చెప్పాలో అర్థంకాక తికమకలు పడుతూంటాను. "ప్రస్తుతం ఏమీ వ్రాయటంలేదండీ" అనటానికి మనస్సు అంగీకరించదు. పోనీ, అలా అంటే 'ఎందుకని మానుకొన్నారు?' అన్న ప్రశ్నగూడ ఉత్పన్నమౌతుంది. 'ప్రస్తుతం తీరికలేదు' అని ఒక్క-మాటలో చెప్పటం సులభమే. కాని, దేశంలో అనేక క్లిష్టమైన సమస్యలు పంచభూతాల్లా మనల్ని పెనవేసుకొని నిత్యం పీడిస్తున్నప్పుడు, మన జీవితాల్లో వడే సంఘర్షణా, అంధకారంలోనుండి భవిష్యజ్జీవితపు బాటల్ని వెదుక్కో-వలసిన తరుణం మనల్ని ఉద్రేకపరుస్తున్నప్పుడు, 'అయ్యో! నేను అస్త్రసన్యాసం చేసికూర్చున్నాను' అని చెప్పగల సాహసం ఏ రచయిత చేయలేడేమోనని నాఅభిప్రాయం.

అయితే, రచయిత కోటానకోట్ల ప్రజాహృదయాల్లో మూలుగుతున్న బాధ, చీకటికోణాల్లో కారుతున్న కన్నీళ్ళు' మన కళ్ళముందే ఆకలితో కృశించి చివికి శల్యావశిష్టమై ఏనాడో రోడ్డుప్రక్క- భయంకర మరణవేదన పడుతున్న అభాగ్యుల్ని చూచినప్పుడు గుండె మండిపోకుండా వుంటుందా? భూస్వామిక పెట్టుబడిదారీసమాజపు చీకటిరెక్క-ల్లో, ఈ ఘోరమైన అన్యాయాలు, అవమానాలూ. మానవుడు మానవుడివట్ల అనుసరించే దురన్యాయాలూ, దుశ్చేష్టలూ ఎలుగెత్తి చాటాలని అహోరాత్రాలు ఆలోచిస్తుంటాను. నా ఆవేదనా

ఆశయం నెరవేరటానికి, పద్మవ్యూహంలాంటి అడ్డు తెరల్ని నాకు లేకపోలేదు. అయినా విశాలాంధ్ర నలుమూలలా నాకు మీరి యిస్తున్న ఆదరణ, అభిమానం నా కొక ఆశాజ్యోతిలా వుంది. ఎన్ని అవాంతరాలనైనా అధిగమించగలను. యింకా యెన్నో నాటకాల్ని వ్రాస్తాను. అదే నా ఉపాసన. అదే నా తపస్సు. అదే నా ఆశయం.

ప్రాచీన ఆధునిక రంగాల్లో గురజాడ, కాళిదాసు, షేక్సిపియర్, రవీంద్రనాధఠాకూరు, షెల్లీ, బెర్నాడ్‌షా, గోర్కీ, టాల్‌స్టాయ్ లాంటి మహాపురుషులంతా నాకు వేగు చుక్కలుగా వున్నారు. ఈ యుగసంధుల సమాజపు వికృత చీకటి తెరల్ని చీల్చుకుని క్రొత్తయుగానికి పయనించే పధికుల్లో నే నొకడిని.

ఇప్పటికి (అచ్చులో) నా పేదరైతు, కూలి, దరిద్రులూ, రైతు బిడ్డలూ తదితర నాటికలు ఆదరించిన ఆంధ్రప్రజలు ఈ "నిరుద్యోగి" నాటికను గూడా ఆదరిస్తారని నా ఆశ.

భవదీయుడు,

కొడాలి గోపాలరావు.



ఈ నాటకాన్ని ప్రదర్శింపగోరువారు నాకు తెలియజేయవలెను. స్టేజీ హక్కులు నాకు చెందియున్నవి. స్టేజీ, రేడియో, బ్రాడ్‌కాస్టు, స్క్రీన్‌ప్లే వగైరాలు నాకు చెందినవి. దీనికి వ్యతిరేకంగా ప్రవర్తించినవారు నేను జరుపు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులు కాగలరు.

ఇట్లు,

కొడాలి గోపాలరావు,

పెదరావూరు (పోష్టు) తెనాలి తాలూకా.

# ఇందులో

| | | | |
|---|---|---|---|
| విశ్వనాథం | ... | ... | నిరుద్యోగి ... బి. ఏ. |
| కామేశం | ... | ... | విశ్వనాథం కొడుకు |
| రామారావు | ... | ... | విశ్వనాథం మామగారు |
| కాంతారావు | ... | ... | నిరుద్యోగి సంఘ సెక్రటరీ |
| శాస్త్రి | ... | ... | వ్యాపారస్తుడు |
| పేరయ్య | ... | ... | మున్సిపల్ కౌన్సిలర్ |
| వెంకటేశం | ... | ... | ప్రెస్ వర్కరు |
| భూషయ్య | ... | ... | బొగ్గులకొట్టు వాడు |
| రామమూర్తి | ... | ... | ఒక భూస్వామి |
| పోస్టు జవాన్ | ... | ... | |
| అన్నపూర్ణ | ... | ... | విశ్వనాథం భార్య |

కాలం : వర్తమానం

స్థలం : ఒక బస్తీ.

# ప్రథమ రంగం

— (తెర) —

(అది విశ్వనాథంగారి యిల్లు. వసారాలో ఒక మంచం-గుడ్డల దండెం. మంచంమీద కామేశం నిద్రపోతూ వుంటాడు - ఎండపొడ మంచంమీద పడుతూ వుంటుంది. షుమారు 8 గంటలవుతుంది. లోపలనుండి అన్నపూర్ణ వచ్చింది. వయస్సు 20 సంవత్సరాలుంటయి. ఒక పాతచీరె-జాకెట్టు-సంస్కారంలేని తల. కామేశం వయస్సు 10 సంవత్సరాలుంటయి)

అన్న : యింకా నిద్రపోతున్నావటోయ్? (లేవగొడుతూ) వరేయ్! కావుడూ! లేరా నాయనా!

కామేశం : (మునగదదీస్తూ) ఉ... ఊ... అబ్బా! లేస్తాలేవే!

అన్న : ఎప్పుడురా లేవటం? పదిగంటలవుతున్నా యింకా నిద్రేనా? (లేపుతూ)

కామేశం : యిప్పుడేంపనుందే? (లేచికూర్చుంటూ)

అన్న : కోమటింటికి వెళ్ళిరావాలి, లేరాబాబూ!

కామేశం : నేను వెళ్ళనే! (పడుకోబోతాడు)

అన్న : ఎందుకని వెళ్ళవురా? (కోపంతో) లే ముందు!

(లేవదీసి కూర్చోబెట్టింది. కామేశం విసుగు, దుఃఖం, కోపంతో అలుగుతూ)

కామేశం : నేను వెళ్ళను పో!

అన్న : (కోపంగా) వెళ్ళవూ ?

కామేశం : (పలుకడు. లేచి వెళ్ళబోతాడు.)

అన్న : నీకేరా చెప్పేది వినపడుతోందా ?

కామేశం : అబ్బా! వినపడిందిలేవే? ఎన్నిసార్లు చెపుతావేమిటే? (విసుగ్గా)

అన్న : త్వరగా దుకాణానికి వెళ్ళిరారా ?

కామేశం : ఆ షావుకారు అప్పివ్వడే నాకు.

అన్న : ఎందుకివ్వడురా? అసలు నువ్వు వెళ్ళి అడిగితేనా? వాడు యివ్వటానికి ?

కామేశం : నేను వెళ్ళలేదంటావుగాని వాడికి లోగడ తెచ్చిన సరుకులకు బాకీ తీర్చారేమిటే?

అన్న : ఏం! యివ్వక ఎగవేస్తామా ?

కామేశం : అది నన్నడుగుతావేం ?

అన్న : వెళ్ళరా! రామ రామా! చెప్పీచెప్పీ నా నోరు పడిపోతుందిగదా! కాస్త పోయిరావమ్మా! మానాన్నవుగా!

కామేశం : (బిక్క మొఖం పెట్టి) నా చావుకొచ్చింది తిరగలేక. (విసుక్కుంటూ) ఆ సంచి యిట్లాపారేయ్.

అన్న : అట్లా విసుక్కుంటావేరా ? నువ్వు వెళ్ళకపోతే యింక ఎవరు వెళతారు? యిక నేనుగూడా సంచి పుచ్చుకోని వీధి వెంట బయలుదేరాలా ?

కామేశం : ఏం, వెళితే తప్పా ?

అన్న : (బాధగా) సరేలే; ఎదురుచెప్పక వెళ్ళిరా ?

(గోపలకు వెళ్ళి సంచీ తెచ్చియిస్తుంది)

యిదిగో! రెండు రూపాయల బియ్యం. ఒక అర్ధసవాశేసు చింతపండు, మిరపకాయలు. వుల్లిగడ్డలు (మధ్యలో)

కామేశం : ఉల్లిగడ్డలూ మట్టిగడ్డలూ. ఈ గాడిద బరువంతా నేను మొయ్యలేను.

అన్న : మొయ్యలేవూ? తినటానికి ఏబరువులూ రావు! ఒక అణా అల్లంగూడా తీసుకురా! ఆ...వస్తూ వస్తూ ఆ కాంత మ్మగారింటికెళ్ళి ఒక కరివేపాకురెబ్బగూడా పట్టుకురా?

కామే : ఊ... సరేలే... (వెళుతూ) ఆ షాహుకారు యివ్వక పోతే తిరిగి వస్తాను.

అన్న : నోట్లో నాలుకుంటేసరి అన్నీ యిస్తాడు.

కామే : యిస్తాడు? తిందువుగానిలే.

(వెళ్ళాడు విసురుగా. అన్నపూర్ణ లోపలకు వెళ్ళబోయింది. మళ్ళీ ఏదో జ్ఞాపకం వచ్చినదానిలాగా వెనక్కు తిరిగివచ్చి ఆతృతగా)

అన్న : వరేయ్. కావుడూ? ఒక్కసారియిట్లారామ్మా: పాడు కాపురం. అన్నిటికీ కరువేనయ్యో - మూండు. రోజులనాడు వెళ్ళాడు. యింతవరకూ అజా పజా లేడు. ఎట్లా చచ్చేది?

(కామేశం తిరిగి వచ్చాడు)

కామేశం : ఎందుకూ నన్ను వెనక్కు పిలిచావు మళ్ళీ? (చికాగ్గా)

అన్న : అసలుదే మరచిపోయూరా!

కామేశం : (విసుగ్గా) ఏమిటీ?

అన్న : ఉప్పులేదురా? ఒక బేడ వుప్పుగూడా పట్టుకురా? మరచి పోయేవు? . . .

కామేశం : మరి యిందాక దేనికి చెప్పలా ? (దిక్కు ముఖంతో)

అన్న : గుర్తు లేదురా! అయినా మొగవాళ్ళు చూడవలసినవన్నీ నేనెక్కడ చూచేది ? ఇట్లా నాలుగేసిరోజులు కొంపకు రాకపోతే యిక్కడివాళ్ళు చచ్చారనుకున్నాడో ! బ్రతికారనుకున్నాడో ! వెళ్ళరా ! యింకా అట్లా నిలబడ్డావేం ?

కామేశం : నేను వెళ్ళనే (స్టూచీ క్రిందపారవేశాడు)

అన్న : ఏ మొచ్చిందిరా నీకు ? (కోపంతో)

కామేశం : ఏమీరాలేదు. నేను వెళ్ళను అంతే ?

అన్న : అంతేనా ? మరి తినటానికి ఎక్కడనుండి వస్తుందిరా ?

కామేశం : నేనొక్కడనే తింటున్నానేం ?

అన్న : నన్ను వేధించక వెళ్ళరా !

కామేశం : నన్నెందుకు పిలిచావు ?

అన్న : వెళ్ళవూ ? (కోపంగా)

కామేశం : ఉ... హూ...

అన్న : చెప్పినమాట వినక ఏమైపోతావురా ?

కామేశం : ఏమైపోతానేం ? ఏమైపోను. రేపు పండగకు అంతా కొత్తకొత్త గుడ్డలు కుట్టించుకుంటుంటే నాకు రెండు చొక్కాలన్నా కుట్టించలేదు ! యింకా వుప్పుతేవాలట ? వుప్పు. తెస్తాలే వుండుపాపం తిండువుగాని ?

అన్న : అంత గుడ్డలు కావాలిస్తే మీనాన్ననే అడగలేకపోయావా ? నేనేం సంపాదించేదాన్నా ! పెట్టేదాన్నా ?

కామే : నాన్న సంపాధించేదంతా ఖర్చుపెడుతుంది నువ్వేగా ? రానీ ? నాన్ననే అడుగుతాను. నాకేం భయమనుకున్నావా?

అన్న : నువ్వు భయమున్నవాడివైతే, చదువూ సంధ్యా వదలి పెట్టి తిరుగుతావా?

కామేశం : నేను తిరిగానంట? హెడ్‌మాష్టరుగారు జీతం కట్ట లేదని నా పేరు తీసివేశాడు.

అన్న : తీసివెయ్యడూ! పుస్తకాలు తాకట్టుపెట్టి తిని తిరుగుతుంటేను.

కామేశం : తిరిగానంట! బడిలో కొచ్చేపిల్లలంతా ప్రతిరోజూ కొనుక్కుతింటారు. నేను ఒక్కనాడన్నా కొనుక్కు తిన్నా నేమిటీ?

అన్న : అందుకని, పుస్తకాలు తాకట్టుపెడతావా?

కామేశం : (పలుకడు)

అన్న : నువ్వు చదివి మమ్మల్ని ఉద్ధరించి చచ్చావుగాని దుకాణానికి వెళ్ళి సరుకులు తీసుకురా?

కామేశం : ఊఁ...యిస్తాడు. మొన్న నాన్నకు కానీబీడీలు యిమ్మంటే లేవు పొమ్మన్నాడు.

అన్న : బీడీలు తాగుతున్నాడా! యింట్లో తిండికి లేక అవస్త పడుతుంటే, బీడీలు కావలసివచ్చినై. అయ్యో! భగవంతుడా? ఈ దిక్కుమాలిన బ్రతుకు మా కెందుకు వ్రాసి పెట్టావురా తండ్రీ? (కన్నీళ్ళు కార్చింది)

వెళ్ళరా అట్లా చూస్తావేరా! దయ్యంపట్టిన వాడికిమల్లే! నువ్వు వెళ్ళకుండా యింట్లోకిరా చెపుతాను (కోపంతో ఉడికి పోతుంది)

కామేశం : ఊఁ... ఈ యింట్లోవుండేకంటే వీధిలో అడుక్కు

తింటే నయం. వారానికి రెండుపూటలు తిండి పెడుతు. న్నారు! ఈ చినిగిన చొక్కాలతో వీధిలోకి వెళితే అంతా నవ్వుతున్నారు.

అన్న : నన్నేంచెయ్యమంటావురా? (దుఃఖం వచ్చింది) మనం సుఖ పడే వ్రాతే ఉంటే అంత డబ్బు తగలబెట్టి పెద్ద చదువు చదివాడుకదా? ఎక్కడన్నా ఉద్యోగం దొరక్కపోయిందా? ఈ కుటుంబాన్ని పోషించలేక, ఉద్యోగం దొరక్క పిచ్చి వాడై తిరుగుతున్నాడు. (కన్నీళ్లు రాలాయి)

కామేశం : (అమాయకంగా) అమ్మా! నిజమేనే! ఒకనాడే నాన్న బీడీ కాల్చుకుంటూ ఆ నెహ్రూ చౌక్‌లో పోతూంటేను అంతా నవ్వుతున్నారే!

అన్న : మనవ్రాత బాగాలేనప్పుడు యెవరైనా నవ్వుతారు. (ఏడ్చింది) మన వ్రాత వాళ్ళకెప్పుడువ్రాస్తాడో భగవంతుడు.

కామేశం : (అమాయకంగా) అమ్మా! మనకు గూడా భగవంతుడు వ్రాశాడటే! చెప్పవూ?

అన్న :(కొట్టింది) వుండరా!నీకడుపుకాల. నువ్వుపుట్టిన తరువాతనే మాకు దరిద్రం వచ్చింది.

కామేశం : (ఏడుస్తూ) మీకు దరిద్రం నేను రమ్మన్నా నేమిటే?

అన్న : అంతా మన కర్మ! ఉద్యోగం దొరక్కపోతే యిరటి కన్నా రాగూడదూ?

కామేశం : వస్తే నువ్వు ఊరుకుంటున్నావేమిటే? అవి లేవూ! యివి లేవూ అంటుంటే అసలు నాన్న యింటికే రాకుండా పోయాడు.

అన్న : నేను చెయ్యలేనమ్మా పాడుకాపురం. ఈబ్రతుకు బ్రతికే కంటే కళ్ళు మూసుకుని ఏ కాలవలోనన్నా పడిచస్తేనయం (ఏడ్చింది)

కామేశం : అమ్మా! ఏడవకే.

(యింతలో బయటనుండి గురవయ్య వచ్చాడు)

గుర : విశ్వనాథం !

అన్న : (కన్నీళ్ళు తుడుచుకుంటూ) లేరండి యింట్లో.

గుర : ఏమమ్మా ! మీ అబ్బాయిని అదుపులో పెడతారా ! లేక మమ్మల్ని పెట్టమంటారా ?

అన్న : మా అబ్బాయి ఏంజేశాడండి ?

గుర : ఎంత తెలియనట్లు మాట్లాడుతారమ్మా! ఔను. మీరు మంచివాళ్ళయితేగా! మీ అబ్బాయి మంచివాడుగావటానికి

అన్న : అసలు వాడేంజేశాడు చెప్పండి?

గుర : అదుగో! దగ్గరే ఉన్నాడుగా ! అడుగు. అడ్డమైన దొంగ తనాలుచేసి ఎట్లా బలిసాడో చూడు.

కామేశం : నన్ను మీరు బలిశాడు, గిలిసాడు అనకండి. మీ కంటే లావుగావున్నానా ?

గుర : నేను నీలాగా దొంగగడ్డి తింటున్నానా ?

కామేశం : ఏమో తింటున్నారేమో ! నేను అన్నమే తింటు న్నాను యిప్పటికీ.

గుర : ఏమిట్రాబికారి వెధవ; తిత్తి తీస్తాను. ఈసారి ఆ వేపు కనుపించు.

కామేశం : తీశావులే పో!

అన్న : ఏమిట్రా! పెద్దవాళ్ళతో ఆ మాటలూ (కొట్టింది) ఏం జేశాడండి వీడు!

గుర : మా దొడ్లో జామచెట్టుకొమ్మలన్నీ విరగదొక్కి ఆ లేత పిందల్ని కోసుకొచ్చాడు. ఈ సారి ఆ వేపు కనిపించాడా? మళ్ళీ ప్రాణాలతో తిరిగిరాడు. జాగ్రత్త!

అన్న : (కోపంతో) కోశావట్రా?

కామేశం (ఏడుస్తూ) ఆకలైతేను రెండు కాయలు కోశానే.

అన్న : (కోపంలో) ఆకలైతే దొంగతనం చేస్తావా: యిన్నేళ్లు వచ్చినై. దేనికిరా; నిన్ను నరికి పోగులేస్తాను పద(పట్టుకొంది)

గుర : విశ్వనాథం వస్తే చెప్పండి

అన్న : కుర్రవాడు తెలియక చేశాడు. యికరాడులెండి

గుర : ఆ కుర్రవాడికి తెలియకపోతే మీకన్నా తెలియక్కర్లా; ఆ కుర్రవాడికి తిండిపెట్టక దొడ్ల వెంట జామకాయల దొంగ తనానికి పంపకపోతే జోలెకట్టి వీధిలో అడుక్కోవటానికి పంపితే పోయేదిగా? దేనికమ్మ! పెట్టి పోయ్యలేనివాళ్ళకు పిల్లలు. పిల్లవాడు అతన్నిఅంటే లాభమేముంది? పెద్దవాళ్ళకుమీకుండాలిగాని ఆ బుద్ధి: (వెళ్ళాడు)

అన్న : విన్నావట్రా? మాకు నువ్వు తెస్తున్న పేరు ప్రతిష్టలు యివేనా: నిన్ను యివ్వాళ నరికి పోగులేస్తాను. పద.

(పట్టుకోబోయింది. అన్నపూర్ణ వెంటపడింది. కామేశం లోపలికి పరుగెత్తాడు. అన్నపూర్ణ వెళ్ళింది లోనికి) . . .

అన్న : యిక వెళ్ళవుగా? దొంగతనం చెయ్యవుగా!

(అనసూయ కొడుతున్న దెబ్బలు—కామేశం ఏడుపు వినిపిస్తయ్. కొద్దిసేపటికి పారిపోయివస్తూ వాకిట్లో కాలుజారి పడతాడు. తల పగుల్తుంది. రక్తం కారుతుంది. అనసూయవచ్చి కామేశాన్ని దగ్గరకు తీసుకో బోతుంది. కామేశం ఏడుస్తూ భయంగా)

కామేశం : అమ్మా! కొట్టకే. యిక దొంగతనం చెయ్యనే... అమ్మా!

అన్న : (పట్టుకుని చూచి ఏడుస్తూ) అయ్యో! నాచేతులు విరిగిపోనూ. ఎంత దెబ్బ తగిలింది నాయనా!

(హృదయానికి హత్తుకుని ఏడ్చింది. కామేశాన్ని తీసుకొని లోపలకు తీసుకువెళ్ళి కట్టుకట్టి తీసుకువచ్చింది)

ఆ దిక్కుమాలినవాళ్ళ దొడ్లోకి దేనికి వెళ్ళావురా! అసలే మన బ్రతుకులు అంతంతమాత్రంగా ఉన్నాయి. పాడు దాన్ని ఎంతదెబ్బ కొట్టానురా! (ఏడ్చింది)

కామేశం : (కన్నీళ్ళు తుడుచుకొంటూ)

అమ్మా? నేను కోమటింటికెళ్ళొస్తానే?

(సంచి తీసుకొని వెళ్ళుతున్నాడు)

అన్న : (కన్నీళ్ళు తుడుచుకొంటూ) త్వరగా నాయన.

(యింతలో వెంకటేశం వచ్చాడు. వయస్సు 22 సంవత్సరాలుంటయి ఒక కాకిట్రౌజరు. కాకి చొక్కా. అంతలావుకు తగిన ఎత్తు వుంటాడు. చాలా చురుకైనవాడు)

వెంక : కామేశం...అక్కా కామేశం లేడూ?

అన్న : కోమటింటికి వెళ్ళాడురా: వెంకటేశం నిన్నటినుంచీ కనుపించ లేదేం? మీనాన్న కెలావుంది?

వెంక : కాస్తకులాసాగానే వుందక్క. డాక్టరు పరవాలేదన్నాడు.

అన్న : పోనీలే నాయనా ! భగవంతుని దయవలన ఆయనకు ఆరోగ్యం బాగుపడితే అదే పదివేలు.

వెంక : బావగారేడి?

అన్న : (చెప్పలేక పోయింది విచారంగా) నువ్వింక ప్రెస్‌లోనే పని చేస్తున్నావా?

(ఆ ప్రశ్నకు అర్థంలేదనుకుంది)

వెంక : అదేమిటక్కా? ఒంట్లో బాగుండలేదా? ఏమిటలా వున్నావు ?

అన్న : ఆ...ఏమీలేదు. ఆ... నీకు పనితీరిక లేదా?

వెంక : ఏదీ! ఓటరులిస్టులు చేస్తున్నాం? పని చాలా తొందరగా వుంది. అందుకని రాత్రిగూడా పనిచేశాను అదనంగా.

అన్న : మీ నాన్న జబ్బుపడటంవలన నీ చదువుపాడైపోయింది గదా !

వెంక : నాన్న జబ్బుపడకపోయినా నాకు యిక పై చదువు చదివే అవకాశం లేదక్కా. ఈ స్కూలుఫైనల్ పరీక్ష ప్యాసవటానికే ఎంతో శ్రమపడవలసి వచ్చింది. పోనీలే ! మనలాంటి పేదవాళ్ళకు ఈ చదువు చదివే అవకాశం ఎక్కడినుండి వస్తుంది ? పకవేళ ఏ యిల్లో పొలమో అమ్మి చదివినా ఉద్యోగం దొరుకుతుందన్న గ్యారంటీఏదీ? బావ చూడు. బి. ఏ. చదివాడు. ఆయనకు ఉద్యోగం దొరికిందా? చెప్పు?

అన్న : అయ్యో! రాత; మీ బావబ్రతుక్కూ, నా బ్రతుకే చెప్పు.

దిక్కు-మాలిన బ్రతుకు. వారికి ఉద్యోగం దొరికితే మాకీ అవస్థ లెందుకు బాబూ!

వెంక : అక్కా. రాత్రి మీరు అన్నం వండుకోలేదటగా?

అన్న : ఎవరుచెప్పారు? (సిగ్గుపడింది)

వెంక : అసలు రెండురోజుల నుండీ బావ యింటికి రావటం లేదటగా!

అన్న : (విచారంగా) కామేశం చెప్పాడా? (కన్నీళ్లు రాలాయి)

వెంక : ఎవరుచెపితేనేం? నిజమేనా? అక్కా నేనొకటి చెపుతా గాని వింటావా?

అన్న : ఏమిటీ?

వెంక : పోనీ! బావకు ఉద్యోగం దొరకలేదనుకో! కామేశాన్ని నా వెంట ప్రెస్‌లోకి పంపరాదూ!

అన్న : (ఏడుస్తూ) పసివాడు. పదేళ్ళన్నా నిండలేదు. వాడేం చేస్తాడు? అంత చిన్నతనంలోనే జీవితభారం వాడినెత్తిన వేయాలా?

వెంక : తప్పేముంది? యింతకంటే చిన్నపిల్లలు మా ప్రెస్‌లో పనిచేయటంలేదు? పరిస్థితులు యింత దారుణంగా ఉన్నప్పుడు అలాఅనుకొంటే ఎలాగక్కా! చదువుకూడా మానివేశాడుగా! యింటిదగ్గరవుండి యిలా గాలికి తిరిగే కంటే ప్రెస్‌లోచేరితే పనన్నా నేర్చుకుంటాడుగా? పది రూపాయలువస్తే యింటి అద్దెకన్నా వస్తయిగా అక్కా?

అన్న : నిజమే వస్తయి. కాని నాదేముంది? వాళ్ళనాన్న అంగీకరించవద్దూ?

వెంక : ఎందుకు అంగీకరించడూ? పనినేర్చుకోవటంలో తప్పేముంది!

అన్న : తప్పని ఎవరన్నారు బాబూ? (విచారంగా) అభిమానం చంపుకోలేక ఏడుస్తున్నాము. నిన్నటివరకూ బాగా బ్రతికిన కుటుంబాలు. వీడితాత. వీడిమావలూ. అంతా బాగా గౌరవంగా బ్రతికినవాళ్ళే! యివ్వాళ గతిలేక ప్రెస్‌లోకి వీడిని పంపితే యింకా అయినవాళ్ళలో మాకు తలెత్తుకోవటానికి రుణం వుందా! (ఏడ్చింది)

వెంక : అట్లా అని కూర్చుంటే ముందు బ్రతికేమార్గం చూడొద్దూ? నీకు తెలుసుగా మానాన్న. ఎమ్. ఏ. చదివాడు. కొన్నాళ్ళు అసిస్టెంటు తహశీలుదారుగా పని చేశాడు. కాని మాభూమి, మానాన్న ఉద్యోగం పోయేసరికి మా గతేమయింది. అలాగని నేనూ కూర్చుంటే యిప్పుడు నాన్న బ్రతికేవాడా! మా కుటుంబం గడిచేదా! కాలాన్నిబట్టే మనమూ మారుతుండాలి.

అన్న : ఏమో నాయనా! (నిట్టూర్చి) అంతా మా కర్మ!

వెంక : కర్మ! (ద్వేషంగా) ఈ కర్మ సిద్ధాంతంవల్ల మనకు కడుపు నిండదు.

(యింతలో కాంతారావు వచ్చాడు. వయస్సు 30 సంవత్సరాలుంటాయి. బక్క పలచగా వున్నాడు. ఎత్తుగా పెరిగిన గడ్డం - పాతగుడ్డలు. ఒక కోటు - కాళ్ళకు పాతచెప్పులు - చేతిలో ఒక హేండ్ బ్యాగు వుంది.)

కాంతా : విశ్వనాథం... (వస్తూ)

అన్న : ఎవరూ ? (తలెత్తి ఆనమాలుపడుతున్నట్టుగా) రా! అన్నయ్యా! రా!

కాంతా : అంతా బాగున్నారా?

అన్న : ఆ... ఏదో యిలాగున్నాం! ఏమిటి? నువ్వు అట్లాగున్నావు? జబ్బుపడ్డావా!

కాంతా : కాదు చచ్చిబ్రతికాను. ఆ... విశ్వనాథం ఎక్కడా? (నలువైపులా చూచాడు)

అన్న : (మంచంవాల్చి) బజారుకు వెళ్ళాడు.

వెంక : వస్తా నక్కయ్యా! కాస్త తొందరగా వెళ్ళిరావాలి.

అన్న : సరే! వెళ్ళిరా నాయనా! (వెళ్ళాడు)

కాంతా : అతనెవరూ!

అన్న : మాయింటిప్రక్క కుర్రాడు. (కూర్చుంటూ)

కాంతా : ఏం చేస్తుంటాడా కుర్రాడు?

అన్న : ప్రెస్‌లో పనిచేస్తుంటాడు. ఆరునెలలనుండే చదువు మానేసి అచ్చాఫీసులో చేరాడు. పెద్ద చదువుచదివే అవకాశం లేకపోయింది. వాళ్ళనాన్న జబ్బుతో హాస్పటల్లో వున్నాడు. ఆ కుటుంబ భారాన్ని మోస్తున్నాడు. వెనక ఆస్తిపాస్తులుగూడా లేవు. (కామేశం బిక్కమొహంతో వట్టిసంచి చేత్తో ఊపుకుంటూ వచ్చాడు)

కామేశం : అమ్మా! ఆ షావుకారు అప్పివ్వను పొమ్మన్నాడే!?

అన్న : (మాట్లాడలేకపోయింది)

కామేశం : చాలాచాలా మాట్లాడాడే!

కాంతా : అరే ! ఏమిటా తలకుకట్టు ? ఏరా కామేశం !

కామేశం : దెబ్బతగిలిందిలే !

కాంతా : ఎక్కడన్నా పడ్డావా ?

కామేశం : ఊ... (చెప్పవద్దని సైగచేసింది)

కాంతా : ఏంపనిమీద వెళ్ళాడు బజారుకు ?

కామేశం : అసలు పనేముంది నాన్నకు. నాలుగురోజులయింది . వెళ్ళి యింతవరకూ రాలేదు.

అన్న : (కోపంతో) ఏమిట్రా ? వెధవ ! వసపోసిన పిట్టల్లే దేనికి అట్లా వాగుతావు ?

కాంతా : పరవాలేదులే ! అసలు ఏం జరిగిందో చెప్పు ?

కామేశం : అమ్మ కళ్లు ఉరుముతుంది. నేను చెపితే చావ తన్నుద్ది. నేను చెప్పను.

కాంతా : నేను వున్నానుగా !

అన్న : యిట్లారారా యింట్లోకి ? (వెళ్ళిందిలోనికి)

కామేశం : చూడు కొట్టదంటివే ! యింట్లో పడవేసి తన్న టానికి రమ్మంటుంది. యిందా కట్లానే జామకాయలుకోసు కొచ్చానని కొట్టింది.

కాంతా : జామకాయలు కోసుకొచ్చావా ! దొంగతనంగా నేనా !.

కామేశం : దొంగతనం అనే అమ్మ తన్నింది. ఆకలై తేనూ రెండు కాయలు కోసుకుతిన్నాను. అది దొంగతనం అని నాకేం తెలుసూ.

(అన్న సూరాయ చెంబుతో నీళ్ళు తెచ్చింది)

అన్న : ముందు లేచి కాళ్ళు కడుక్కో అన్నయ్యా !

కాంతా : కడుక్కుంటాలే ! ఏమిటీ ? అసలు విశ్వ యింటికే రావటం లేదా ? యింకా వాడికి ఉద్యోగం దొరకలేదన్న మాట ?

అన్న : తిరుగుతూనే వున్నాడు. వేళకు తిండీ తిప్పలూ లేవు కదా ? రెండు మూడు రోజులు యింటి ముఖమే చూడడు. వచ్చింది మొదలూ నేను ఏదన్నా అడిగితే కస్సుమంటూ లేస్తాడు. కంటికీ వంటికీ విశ్రాంతి లేదుకదా ! (దుఃఖాన్ని ఆపుకొంటూ) ఎందుకులే అన్నయ్యా ! మా బ్రతుకులు చెప్పుకోవటానికిగూడా సిగ్గుగానే వున్నయి. (ఏడ్చింది)

కాంతా : అధైర్యపడకమ్మా ? కాస్త ఓపికపట్టు. ఎక్కడన్నా ఉద్యోగం దొరక్కపోదు. యిప్పుడు మేమంతా నిరుద్యోగులమేగా ? మొన్న మావదిన భరించలేక చనిపోయింది.

అన్న : అయ్యో ! ఎప్పుడూ ?

కాంతా : ఒక నెలరోజులైనది. (విచారంగా)

అన్న : జబ్బేమిటీ ?

కాంతా : తిండిలేకపోవటమే. అధైర్యపడితే బ్రతకలేం. ఏమైనా యిప్పుడు వాడిబ్రతుకంతా నీచేతిలో వుంది.

అన్న : నేనేం చేసేదన్నయ్యా ! వారిని నేను మాత్రం ఏమంటాను ? వారు అట్లా బాధపడుతోంది మాకోసంకాదూ ! యింటిచుట్టూ అప్పులు. యింట్లో అన్నీ కరువేకదా ? ... (ఏడ్చింది) ఆయన యింటి మొఖమే చూడటంలేదు.

కాంతా : ఊరుకో...నేనుగూడా నాచేతనైనంత సహాయం చేయటానికే వచ్చాను.

అన్న : వారికిమాత్రం దిక్కెవరున్నారు? (కన్నీళ్ళు తుడుచుకొని) లే, అన్నయ్యా! కాళ్లు కడుక్కోముందు...

(కాంతారావు లేచి కాళ్ళుకడుక్కోవటానికి వెళ్ళాడు. ఇంతలో లోపలనుండి కామేశం వచ్చాడు.)

అయ్యో! భగవంతుడా! యివ్వాళ అందరు వస్తుండాల్సిందేనా? యిదిగో! కావుడూ. నువ్వు కాస్తవెళ్ళి వెంకటేశాన్ని పిలిచివస్తావూ్మ!

కామేశం : ఆ...యిప్పుడే తీసుకొస్తాను

అన్న : వెళ్ళిరావూ్మ త్వరగా (వెళ్ళాడు)

యింతలో విశ్వనాథాన్ని శాస్త్రి తీసుకువచ్చాడు. విశ్వనాథం గుడ్డలన్నీ మాసి దుమ్ముపట్టి వున్నయ్. గడ్డం పెరిగివుంది. కళ్ళులోతుకు పీక్కుపోయివున్నాయి. చిక్కి శల్యమైవున్నాడు. వయస్సు 34 వుంటాయి షుమారుగా. అన్నపూయ చూచి నిలువునా నీరైపోయింది. దుఃఖంతో వొణికిపోయింది)

అన్న : అయ్యో! ఏమిటండీ? ఏం జరిగింది?

(ఆతృతగా దగ్గరకు వచ్చింది)

శాస్త్రి : ఏమీలేదు. మంచంవాల్చు. కాస్త తిండితక్కువవల్ల స్మారకం తప్పింది. అంతే!

(అన్నపూయ మంచం వాల్చింది. శాస్త్రి విశ్వనాథాన్ని కూర్చోబెట్టాడు)

ముందు త్వరగా కాసిని మంచినీళ్ళు అందుకో. అమ్మా.

(లోపలికెళ్ళింది)

ఎట్లావుందిరా వంట్లో!

విశ్వ : (మెల్లగా) అప్పుడే ప్రాణం పోదు.

(మంచినీళ్ళ గ్లాసుతో వచ్చింది. విశ్వనాథం కొద్దిగా త్రాగాడు. భార్యవంక వెఱ్ఱిగా చూచాడు. అన్నపూర్ణ భయపడింది)

అన్న : ఏమిటండీ? అట్లా అయిపోయారేం !

( కన్నీళ్ళు పమిటచెంగుతో అద్దుకొంది )

విశ్వ : అనూ... అనూ... ఊరోక... ఏడవకు. నాకేం భయంలేదు.

శాస్త్రి : అనూ, వినూ, ఏమిట్రా? నీకోసం ఆ యిల్లాలు అట్లా కళ్ళల్లో జ్యోతులు పెట్టుకు ఎదురు చూస్తూవుంటే నువ్వు బస్టాండుల్లో పడిపోతే ఆ మ్మాయి మనస్సు వుండబడుతుందా ?

(కాంతారావు వచ్చి యిద్దర్నీ చూచి ఆశ్చర్యంగా చేతులుతుడుస్తూన్న గుడ్డ పడవేసి)

కాంతా : హల్లో! శాస్త్రీ! కులాసాయేనటోయి?

శాస్త్రి : యిప్పటివరకూ ! కులాసాయే !

కాంతా : (దగ్గరకొచ్చి) విశ్వనాథం... ఏమిట్రా అలా వున్నావు? శాస్త్రీ ఏమిటోయిది?

శాస్త్రి : ఏముంది? పనిలేని వాళ్ళంతా బస్టాండుల్లోనేగా బతికేది. బి. ఏ. చదివి మనవాడు బస్టాండుల్లో భిక్ష మెత్తుకుంటున్నాడు.

కాంతా ! భిక్ష మెత్తుకుంటున్నాడా !

శాస్త్రి: లేకపోతే కలక్టరుద్యోగం చేస్తున్నాడనుకున్నావా? డామ్. ఎన్నిసార్లు చెప్పానురా వీడికి. బుద్ధిలేకపోతేను.

( అనసూయ విశ్వనాధాన్ని లోపలకు తీసుకువెళ్ళింది )

చూడరా? ఆ యిల్లాలు వీడి ప్రాణానికి ఉసూరుమంటూ ఎలా ఏడుస్తోందో ?

కాంతా: వాడుమాత్రం ఏం చేస్తాడురా? వున్నడబ్బంత అందరి లాగానే విద్యాపీఠం మీద హారతికర్పూరంలా వెలిగించాడు. బి. ఏ. వరకూ చదివాడు. అంత చదువు చదివినా సంవత్సరంనుండీ ఉద్యోగం దొరకలేదు. వెనక ఆస్తిలేదు. మరి యింకా వాడేం చేస్తాడు?

శాస్త్రి: ఉద్యోగం దొరక్కపోతే కూలిపని చేసన్నా పెళ్ళాం బిడ్డల్ని పోషించాలి. అంతే: కాని, యిలా ఎంతకాలం ప్రిస్టేజీతో కడుపు ఎండగట్టుకుని చస్తాడురా ?

కాంతా: కూలివాళ్ళకే పనిచాలక చస్తుంటే యిలాంటి చదువుకున్న వాడికి ఎవడిస్తాడోయ్ కూలిపని? దేశంలో లక్షలాది నిరుద్యోగులు పెరిగి పోతున్నారు. కుటుంబాలతో అల్లాడిపోతున్నారు. దేశానికి స్వరాజ్యంవచ్చినా ప్రభుత్వం వీళ్ళసంగతి ఆలోచించటం లేదు.

శాస్త్రి: ఏం స్వరాజ్యం వస్తే. వాళ్ళు మీఅందరికీ ఉద్యోగాలిస్తానని బాండు వ్రాసియిచ్చారా? వాళ్ళువచ్చి పదిరోజులన్నా కాలేదు. అప్పుడే వాళ్ళను నిందిస్తూకూర్చుంటే ఏంలాభంరా? ఎన్నిసమస్యలూ! అటు కొరియాయుద్ధం, ఇటు రాష్ట్రాల విభజనోద్యమాలు. అటు పాకీస్తాను ఆర్భాటాలు అబ్బ; ప్రభుత్వాన్ని నిద్ర పోనిస్తున్నారా?

కాంతా : నిద్రపోనిస్తున్నారా? అంటావు! యిప్పుడు నిద్రపోక చేస్తున్న దేమిటి? పండించేవాడికి భూమి నిచ్చారా? కూలి వాడికి కూలి గ్యారంటీ యిచ్చారా? దేశంలో ప్రాజెక్టులూ, పరిశ్రమలూ అభివృద్ధి చేశారా? వేలకువేలు జీతాలు పుచ్చుకునే మంత్రివర్యులంతా యిలాంటి కొన్ని వేల కుటుం బాల చావుకు మూలకారణం అంటాను.

శాస్త్రి : వీళ్ళను చావమన్నారా వాళ్ళు!

కాంతా : అనలేదా? కష్టపడే రైతుకూ, చదువుకున్న మేధా వికీ, పెట్టుబడిపెట్టే వ్యాపారస్తుడికీ, ఎవడికీ గ్యారంటీలేక, ఎవ రికీ భద్రత లేకపోయినాక ఈ దేశం దేనికి? మనకు స్వరాజ్యం వచ్చిందని చెప్పుకోవటం దేనికి?

శాస్త్రి : మనది బీదదేశం. డబ్బులేకపోతే ప్రాజెక్టులేం కడతారు? పరిశ్రమలేం పెంచుతారు? పనేంచూపెడతారు? అప్పుల కోసం జోలెకట్టుకుని యితర దేశాలమీద పడటం చూడ టంలా.

కాంతా : నేను వాదనలోకి రానటంలేదు. సిగ్గులేకుండామాట్లా డకు. మనదేశంలో వున్న ఖనిజసంపత్తి, భూములూ, నదులూ, ఏదేశానికున్నయ్? సీలాంటి పెట్టుబడిదారుల్ని పరిశ్రమల్ని పెట్టటానికి ప్రోత్సహిస్తే, నువ్వు డబ్బు యివ్వవా?

శాస్త్రి : యిస్తాను.

కాంతా : మరి అపరాధం ఎవరిది? యిలాంటి అసమర్థపు పరి పాలకులో ప్రజల జీవితం నాశనం చేస్తున్నారు. యివ్వాళ

విశ్వనాథం లాంటి చదువుకున్నవాడికి ఉద్యోగం దొరక లేదంటే ఎవరు కారణం?

శాస్త్రి: ఆ... పోనీలే నాకెందుకాగొడవ. నువ్వు ఏదో సంఘం పెట్టినట్లున్నావే!

కాంతా: నిరుద్యోగ సంఘం.

శాస్త్రి: ఈ సంఘాలేం చేస్తయిరా?

కాంతా: సంఘశక్తికన్నా మానవుడికి హక్కుల్ని సాధించే మార్గం మరొకటిలేదు. అసలు 'కూలివాళ్ళలా' అనే ప్రిస్టేజీ లేకపోతే ఈ చదువుకున్న వాళ్ళంతా సంఘటితమైనిలిస్తే ఎందుకు ఉద్యోగాలురావు? మాకు ఉద్యోగం యివ్వలేక పోతే, మా పితార్జితాలు పెట్టి చదివిన నష్టానికి, మా కుటుంబ మరణానికి ప్రభుత్వమే బాధ్యత వహించాలి.

శాస్త్రి: అయితే నువ్వు ప్రభుత్వాన్ని పడగొట్టాలని చూస్తు న్నావన్నమాట?

కాంతా: నేనేం రాజకీయవేత్తనుకాను. నాకు ప్రభుత్వాన్ని పట్టుకోవాలనిగాని, అధికారం చేబట్టాలనిగాని, ఒక మంత్రి నన్నా కావాలనిగానీ లేదు. నాకు కావలసిందల్లా ఉద్యోగం, తిండి, గుడ్డ, అంతే.....

శాస్త్రి: చదువుకున్నవాళ్ళం మనంగూడా యిట్లా సంఘాలు పెట్టి సమ్మెలు చేయటంమూలంగానే మనవిలువ పోతూ వుంది.

కాంతా: మనకంటే కూలివాడు చాలా విలువైనవాడు మనకు యీ మధ్యతరగతి అహంభావాలే మన దుర్గతికి మూలకా

రణంగూడాను (లోపలినుండి విశ్వనాథం వచ్చాడు. చాల నీరసంగా వున్నాడు) ఎట్లావుందిరా వంట్లో?

విశ్వ: యిప్పుడే చస్తానన్న భయంలేదు.

కాంతా: నీకేమన్నా మతిపోయిందేం?

శాస్త్రి: యివ్వాళ పోవటమేమిటి వాడికిమతి. కాకపోయినా పెళ్ళానికి కూడుపెట్టలేనివాడు చస్తానసక బ్రతుకుతానం టాడా?

విశ్వ: ఇప్పుడు నే నేమన్నా నీకు ఎగతాళిగానే ఉంటుంది. నా బ్రతుకు నవ్వులాటకావటంలో వింతేముంది?

శాస్త్రి: ఏముంది. ఎప్పుడూ నా డబ్బుమీదపడి ఏడుస్తూ వుంటాడు. (బాధగా) నువ్వు సంపాదిస్తే నేనొద్దన్నానా!

విశ్వ: లేనివాడికి ఉన్నవాడిమీద అసూయని నీలాంటివాళ్ళు అంటారు. నేను నీయంత లక్షాధికార్ని కావాలని కోరిక లేదు. నీలాగా కోటికిపడగలెత్తి కూటికిలేనివాళ్ళ కడుపులు కాల్చాలసిలేదు. నా భార్యా బిడ్డలూ కడుపునిండా తినటానికి వుంటేచాలని అనుకుంటున్నాను.

శాస్త్రి: విన్నావురా వాడిమాటలు? వీడికి ఉద్యోగం దొరకక పోతే నన్ను తిట్టాలా? వీడి పెళ్ళాంబిడ్డలకు తిండిలేకపోవడం నాదన్నమాట తప్పు?

కాంతా: వాడన్నమాటలో అదే అర్థంవుందని నీవు ఎలా చెప్పగలవు? లోకంలో—ముఖ్యం సమాజంలో విషయం చెప్పాడు. ఆఁ... యిప్పుడు నీ వ్యాపారం ఎట్లాసాగుతోంది.

విశ్వ : (విచారంగా అటూ యిటూ తిరుగుతున్నాడు)

శాస్త్రి : అసలు వ్యాపారాలు సాగితే మాకీ అవస్థెందుకురా? అన్నీ నష్టాలే?

విశ్వ : అవును. అన్నీ నష్టాలే: అందుకే రెండు లక్షలు బ్యాంకీలోవేసి కూర్చున్నాడు. రెండెకరాల కొంపదమ్మి ఎఫ్. ఎ. చదివి, ఆరుసంవత్సరాలు పరీక్షల్లో దండయాత్రలు కొట్టి, చివరకు పరీక్షకు కట్టటానికి నీదగ్గరా. నాదగ్గరా డబ్బులు ఎత్తుకెళ్ళిన పెద్దమనిషి. రెండులక్షలు సంపాదించాడంటే, యింకా రెండు మూడులక్షలు వ్యాపారంలో పెట్టుబడిపెట్టి కూర్చున్నాడంటే నష్టంగాక లాభంవచ్చిందని బుద్ధివున్నాడు ఎవడన్నా అంటాడా!

శాస్త్రి : విశ్వం...(కోపంతో)

విశ్వ : ఎంతకోపం వచ్చిందో చూడు? యీయుద్ధంలో పుట్టిన బిడ్డకు అంతఅభిమానం,కోపంరావటంలో ఆశ్చర్యమేముంది?

శాస్త్రి : (కాంతారావుతో) ఏమిట్రా అట్లా నోరుతెరుచుకొని చూస్తావు? వున్నవాడినిచూస్తే లేనివాడికి ద్వేషంలేదంటివే?

కాంతా : ఔనురా! అంతడబ్బు ఎలా సంపాదించావు?

విశ్వ : ఎట్లా సంపాదిస్తాడు. వుందిగా నల్లబజారు వ్యాపారం. యింకా అర్థంకాలేదూ!

శాస్త్రి : బ్లాకు మార్కెట్టట బ్లాకుమార్కెట్టు. అసలు బ్లాకు మార్కెట్టు చేయకుండా ఒక్కకానీ సంపాదించిన వాడిని చూపించు.

కాంతా : అంత అవినీతికి ఎలా వడిగట్టావురా! నువ్వు కాలే

జీలో చదివేటప్పుడు అవినీతిమీదవుపన్యాసాలు చేసేవాడివి. గుర్తుందా ?

విశ్వ : అంత ఆశ్చర్యందేనికిరా! వీడు పూర్వపు కాలేజీలో చదివేనాటి శాస్త్రిగాడనుకోకు. వాడుచచ్చాడు. ఈ మహానుభావుడు పుట్టాడు.

శాస్త్రి : చూచావురా వాడెలా పేలుతున్నాడో !

కాంతా : స్నేహితుడుగాబట్టి దాపరికంలేకుండా వున్నదివున్నట్టు ముఖంమీద అన్నాడు తప్పేముంది ?

విశ్వ : సరే! అదినీకు తప్పుగా కనుపించలా ? అసలు డబ్బు సంపాదించటం అవినీతి, మరి బస్ స్టాండుల్లో భిక్షమెత్తుకోవడం అవినీతి కాదు.

శాస్త్రి : షటప్ ! నీలాంటి బికారి కొంపకురావటం నాదేతప్పు! వెధవబ్రతుకు నీదీ ఒకబ్రతుకేనా !

కాంతా : అన్యాయాన్ని దార్జన్యంతో దాచిపెడతావురా ?

శాస్త్రి : బి. ఏ. వరకూ చదువువెలిగించి బికారిలాగా వీధులంట భిక్షమెత్తుకుంటూ నన్ను అవమానిస్తాడూ ? నన్నేదో వీడు తప్పుపడుతున్నాడుగాని, అంత ప్రిస్టేజీకలవాడు పెళ్లాం చీరెల్ని ఎలా తాకట్టుపెట్టుకున్నాడో అడుగు ?

విశ్వ : (ముఖం ఎర్రబడింది) నేను గతిలేకనే పెళ్ళాం చీరెల్ని తాకట్టుపెట్టుకున్నానే అనుకో; అవి తాకట్టుపెట్టుకొని ఈ మహానుభావుడిచ్చింది మాత్రం ఎంతో అడుగు ?

కాంతా : అంత దారుణానికెలాపాల్పడ్డావురా శాస్త్రీ !

విశ్వ : దారుణమేముంది! వాడుచేసే వ్యాపారమే అది.

శాస్త్రి : ఇంకావివరాలెందుకు లేవోయి. నువ్వు నిజంగా అభిమానం గలవాడివైతే ఈ నీచానికి ఆత్మహత్యచేసుకునిచచ్చే వాడివే. (సిగిరెట్టు తీసాడు)

కాంతా : శాస్త్రీ... (కోపంగా) చచ్చేవాడి నెత్తిన నాలుగు రాళ్ళు వేయటం మర్యాదేనట్రా ? నువ్వు స్నేహితుడివై వుండి వాడికి నువ్వు నేర్పేపాఠం యిదేనా ?

శాస్త్రి : కాకపోతే, పెళ్ళానికి కూడుపెట్టలేనివాడు బ్రతికుండి చేస్తున్న నిర్వాకం ఏమిటో ?

విశ్వ : నిజం చెప్పావురా? (క్రోధం, దుఃఖం రెండూ వచ్చినై) ఎంతటి విద్యాగంధంవుంటేనేం? డబ్బున్నవాడికున్న విలువ దేనికుంటుంది? నీలాంటి డబ్బున్నవాడిదే లోకం, సమాజం. నిజం చెప్పాలిసొస్తే డబ్బుకోసం నీవుచేసిన అవినీతికార్యం ఎవ్వడూ చెయ్యలేడు. డబ్బుకోసం మరదలు మొగుణ్ణి విషంపెట్టి చంపావు? ఆ అమాయకురాలిని మంచిచేసుకుని ఆ ఆస్థినంతా తెచ్చివేసుకున్నావు? ఆఖరకు ఆ అమ్మాయికి తల గొరివిపెట్టి వీధిలోకి నెట్టావు. ఛీ. వెధవబ్రతుకు. నువ్వొక మనిషివేనా ?

శాస్త్రి : నోర్మూయ్. (పెద్దగా అరిచాడు) జాగ్రత్త. స్నేహితుడవైపోయావు. ఛీ. నిన్ను నా స్నేహితుడవని చెప్పుకోవటం గూడా సిగ్గే; నేను వెళుతున్నారా! (కోపంతో) వస్తే రా! మా యింటికి. (వెళ్ళబోయాడు)

కాంతా : శాస్త్రీ! ...అంత తొందరపడతావేంరా? వస్తాలే భోంచేసి. యింటిదగ్గరే ఉంటావుగా ?

శాస్త్రి : (ఉద్రేకంగా) సరే! నీ యిష్టం. పాతస్నేహితుడవని ఒకసారి రమ్మన్నాను. వచ్చేటట్లుంటే రా!

విశ్వ : వెళ్ళిరారా! బ్రతికినంతకాలంవుందేగా మనకు. వెళ్ళిరా. (విచారంగా)

కాంతా : సరే! నువ్వు యింటిదగ్గరేవుండు వెళ్ళొస్తాను. నీతో మాట్లాడాలి. సరేనా ?

(యింతలో అన్నసూయవచ్చింది. కాంతారావులేచాడు వెళ్ళటానికి. ఇద్దరూ కలిసి వెళుతూ)

శాస్త్రి : అసమర్థులకు అభిమానం జాస్తిరా? వీడేదో నీతిగా బ్రతుకుతున్నాననుకుంటున్నాడు. అప్పులవాళ్ళచేత నానా బూతులు తిట్టించుకుంటూను.

కాంతా : దేనికిరా ఎప్పుడూ నువ్వు వాడిచావుకోరుతావు ?

శాస్త్రి : ఏం! వీడు చస్తే లోకం ఆగిపోతుందనుకున్నావా? యిట్లాంటి అసమర్థుడిని కట్టుకోబట్టే ఆ యిల్లాలుకు ఆ గతి పట్టిందని ఏడుస్తోంది. వీడు చచ్చినా ఆ యిల్లాలు పుట్టింటి దగ్గరన్నా సుఖపడేది ?

కాంతా : నోన్సెన్స్. వెధవవాగుడు కట్టిపెట్టు.

(యిద్దరూ వెళ్ళిపోయారు. తెరలోనుండి గూడా ఈ మాటలు విని పిస్తూనే వున్నాయి. అన్నసూయ ఈ మాటలు విని భోరున ఏడ్చింది. విశ్వనాథం అవమానం దుఃఖం క్రోధంతో భార్యవంక అనుమానంగా చూచాడు. అన్నసూయ గజగజా వణకిపోయింది)

విశ్వ : (కళ్ళెర్రజేస్తూ) చెప్పావా వాడితో ?

అన్న : (భయంగా) ఏమిటీ ?

విశ్వ : (కోపం పట్టలేకపోయాడు. ఫెళ్ళున చెంప పగిలేటట్టుగా కొట్టాడు):
యింకా మాట్లాడుతా ఎదురు? సిగ్గులేదూ! ఛీ.

(వెళ్ళాడు దూరంగా)

అన్న : (ఏడుస్తూ) అయ్యో! భగవంతుడా! నే నేపాపమెరుగనండి?

విశ్వ : ఎరగవూ? (పెద్దగా గర్జించాడు) నువ్వు చెప్పకపోతే వాడికెలా తెలిసింది?

అన్న : ఏమిటి తెలిసింది? నే నెందుకు చెప్తానండి. (ఏడుస్తూ) ఆయన ఎన్నడూ యిక్కడికి రానుకూడా రాడే! అయినా యెవరితోనో చెప్పుకోవాల్సిన గతి నాకే మొచ్చింది?

విశ్వ : (మంచంమీద కూలబడి. కోపంతో)
ఛీ. వెధవజీవితం. నేను చస్తే మీ అందరి శనీ విరగడై పోతుందిలే? (హృదయం గాయపడింది) నిజమే. పెళ్ళాం బిడ్డల్ని పోషించలేని నాలాంటి అసమర్థుడు బతికిచేస్తున్న నిర్వాకం ఏమిటి? నేనుచస్తే పుట్టింటిదగ్గర మీరన్నా సుఖపడేవాళ్ళు.

అన్న : అయ్యో! ఎవరన్నారండీ ఆమాటలు.

విశ్వ : (విచారంగా) నాలాంటి అసమర్థుడిని ఎవరైనా అంటారు. అసలు అసమర్థుడికి అభిమానం ఎక్కువని వాడెందు కంటాడు. (కన్నీళ్ళురాలాయి)

(యింతలో కామేశం వచ్చాడు)

కామేశం : అమ్మా! వెంకటేశం యింట్లో లేడే?

విశ్వ : (విశ్వనాథం తలెత్తి కామేశంవంక దీనంగా చూచాడు.) తలకు కట్టు కట్టావేమిటా?

కామేశం : దెబ్బతగిలింది నాన్నా.

అన్న : (అన్నపూర్ణకు దుఃఖం పొంగివచ్చింది. కామేశాన్ని తీసుకొని ఏడుస్తూ లోపలకు వెళ్ళిపోయింది)

విశ్వ : ఎందుకు తగిలింది ?

(సమాధానం రాలేదు. సిగ్గుపడ్డాడు. దుఃఖంతో ముఖం కప్పుకున్నాడు. కూర్చోలేక లేచాడు. ముఖం నల్లబడింది. ముఖం చెమటతో నిండిపోయి ఏమిటో అస్పష్టంగా వాగుతున్నాడు. యింతలో బయట నుంచి రేడియో సాంగు వినిపిస్తూంది. * పాటవుంటుంది.)

(యింతలో భూషయ్య వచ్చాడు. అంతా మొరటు వేషం. మొరటు పద్ధతి. నల్లగా ఉంటాడు. ఆజానుబాహుడు. వయస్సు 40 సంవత్సరాలుంటయ్. నీరుకావిరంగు గుడ్డలు.)

భూష : విశ్వనాధంగారూ !

విశ్వ : (విసుగ్గా) ఎవరూ ?

భూష : ఎవరుకాడికొచ్చిందే యవ్వారం ? ఎన్నాళ్ళయిందిగనే బొగ్గులబస్తాదెచ్చి. నాకు తెలియకడుగతాలే ! ఎప్పుడు వచ్చినా యింటిపట్టునే వుండవ్వా మేమేమన్నా యాపారం చేసుకునేవాళ్ళంగని అనుకుంటివా ? లేక ఎత్తేసుకుపొయ్యే వాళ్ళంగని అనుకుంటివా ! అంట ? అ...హ నాకు తెలియకడుగుతాలే ! యిట్లా ఎంతకాలంగని తప్పించుకు తిరుగుతావ్వా అంట ?

విశ్వ : యిదిగో ! భూషయ్యా ! నాలుగురోజులు ఆగు నీడబ్బు నీకు యిచ్చేస్తాను.

భూష : ఆ .. యిచ్చినవులే. నిన్ను నమ్ముకుని బాగుపడ్డ వాడేని చూళ్ళా ? నాకు తెలియకడుగుతాలే. యివ్వాళ పుట్టినిడబ్బు నాలుగు రోజులికి ఊరిగనివస్తదిగనేం ? ఏం

దయ్యా! అంతా తలాగోకాతేని కబుర్లు చెప్తుతావు. నిన్ను ఈపాటున యిడిచిపోతే మళ్ళీ మూడు మాసాలకేగదూ నా కంటపడేది?

విశ్వ: ఇంకా డబ్బురాలేదు.

భూష: ఎక్కన్నుండి రావాల్నేంది? కర్నూలునుండిగని రావాల్నేంది? అహాఁ. నాకు తెలియకడుగుతాలే.

విశ్వ: నువ్వు ఎలా అడిగినా అంతే. నా చేతులో లేనిదే ఏం చేయను?

భూష: ఎట్లా? చేతిలోవస్తేగదూ వుండటానికి. దొరగారికి ఎక్కడనుండోవస్తుందటనే! మా తెగవగా యిచ్చేవాడివి. నిన్నునమ్మి మూడు మాసాలు మోసపోతినిగదయ్యా? యింకా మోసంచేయాలని చూస్తుండా? యిక అదిక సాగదుగాని, నా డబ్బుగట్టి గడపదాటిపో! నాకు ఇబ్బందిలా? ఏందయ్యా! అట్లా చూస్తావు? నీకు అప్పుగని ఉండానా ఏందీ? నీ గడప ఎక్కనూ దిగనూ సరిపోయెనే? యిది మనిసికి లక్షణమా అంట? కాస్తచెప్పయ్యా యింటాను.

విశ్వ: నువ్వు లక్షతిడితేమాత్రం నా దగ్గరలేనిది ఏం చేయనూ?

భూష: ఏందామాట. అప్పుతెచ్చి నన్ను యిట్లా అవస్తపెడితే నీకు న్యాయంగా వుందిగనే అంట?

విశ్వ: ఎవరన్నారు? నాదగ్గర లేదన్నాను. అంతే!

భూష: ఎట్లా! నేను మాట్లాడేదంతా గాలికగని పోతుందం టావుగనే? చదువుకున్నవాళ్ళు చేయవలసింది యిట్లాగే నాని? అంత చీమూ నెత్తురూ లేకుండా బతికితే ఎట్లా గయ్యా! మాటకంటే మరణం మేలుగదో!

విశ్వ :(లేచి విసుగ్గా లోపలకు వెళ్ళబోతాడు భూషయ్య అడ్డు వచ్చాడు)

భూష : దొడ్డి వాకిల్ని దూరిపోదామని చూస్తుండా. బొడ్లో చెయ్యివేసి నడిరోడ్లో నిలవదీస్తాను. నా సంగతి తెలిసి తిరుగుతుండావా అని ? నాదస్తునాకిచ్చి దొడ్డివాకిల్నే పారిపో నాకిబ్బందిలా ?

విశ్వ : (కోపంతో) అడ్డులే ?

భూష : కొంథతావుగాని ఏంది ? నా అప్పాయియ్యమంటుంటే గేద గొడ్డులాగా గంతులేస్తావు ఏందీ ?

విశ్వ : నోర్మూయ్ ! వెళ్ళవతలకు (కోపంతో)

భూష : ఎట్లా ! బెదిరిస్తుండావుగనేంది ? నోరుమూయాలనటనే! మూస్తాగదో ? (కోపంతో) అప్పుగావలసిననాడు అమ్మా ! బాబూ ! అనేది. తీరా యియ్యాలసొచ్చేసరికి అడ్డం తిరుక్కుంటా ?

విశ్వ : నువ్వు గొంతు కోసుకున్నా అంతే. నాదగ్గరకు రాగానే యిస్తాను.

భూష : మా యిచ్చే మొగోడివి బయల్దేరావులే ? ఎన్ని మాసా లయింది నీకు అప్పుపెట్టి ?

విశ్వ : ఎన్ని మాసాలయితేనే ? ఎగవేశానా ?

భూష : డబ్బు యిచ్చినాకగాదో నువు ఆమాట చెప్పాలిసింది. యిట్లా అరిచేతిలో వైకుంఠం చూపుతా ? రోషం పాపం లేకుండా పోయెనే మనిషికి. అంతా నీలాంటి అమాంబా పతే అయితే యింకాఏమిటి మేము యాపారాలు చేసి చచ్చేది ? యిదిగోనయ్యో ! రేపువత్తా. నాబాకీ నాకు

యిచ్చేయి లేకపోతే మర్యాదగనిదక్కదు. తెలిసినదిగదో! ఏంది పలకవు?

విశ్వ: సరేలే! పో! (విసుగ్గా)

భూప: నాకేదో బిత్తర వెయ్యాలని చూ త్తివా? యిక భూమిమ్మీద నూకలు మిగలవు. (వెళ్ళాడు)

(విశ్వనాథం వెళ్ళలేక మంచంమీద కూలబడ్డాడు. యింతలో ఆందోళనగా అన్నసూయ వచ్చింది ఏడుస్తూ.)

అన్న: ఏమండీ? ఒకసారి లోనికిరండి.

విశ్వ: దేనికి? (కోపంతో)

అన్న: పిల్లవాడికి జ్వరం మండిపోతుంది. (ఏడుస్తూ) యిప్పటి వరకూ బాగానే వున్నాడు. యింతలోనే ముంచుకొచ్చిందండీ?

విశ్వ: చావనీయి. వెధవ సంతానం. అందరిబరువూ తీరిపోతుంది. (కోపం, విసుగూ, అవమానంతో నిట్టూర్చుతూ వున్నాడు.)

అన్న: (ఏడుస్తూ) అయ్యో! అవేంమాటలండీ? అభం శుభం తెలియని ఆపసివాడిమీదగూడా దేనికండీ మీకు కోపం?

విశ్వ: వెధవముఖం పెట్టుకుని ఏడుస్తూ కోరొచ్చేరు. వెళ్ళవతలకు ఈ సంసారం చేసేకంటే చస్తేమంచిది?

అన్న: మేమే కదండి మీకు బరువైనది. మేము చచ్చిపోతే మీరన్న సుఖంగా వుండండి.

విశ్వ: చస్తే చావుపోయి. (లేచి వెళ్ళాడు పక్కకు. అన్నసూయ ఏడుస్తూ లోపలికి వెళ్ళింది.)

(యింతలో పేరయ్య వచ్చాడు. వయస్సు 39 సంవత్సరాలుంటయి. విలువైన గుడ్డలు వేశాడు. చేతిలో వెండిపన్ను కర్రవుంది.)

పేర : (శేస్తూ) మీ ఆలీ మొగుళ్ళమధ్య అడ్డు రాలేదుకదా ?

విశ్వ : ఓ... పేరయ్యగారా రండి రండి.

పేర : నేను అడిగినదానికి సమాధానం చెప్పలేదు.

విశ్వ : దేనికి ?

పేర : మీ ఆలీ మొగుళ్ళమధ్య అడ్డురా లేదుకదా ? (రెట్టిస్తూ) ఏం, వచ్చానంటారా ?

విశ్వ : అబ్బే ! రాలేదులెండి.

పేర : ఆ... రాకపోవటమేమిటి ? నేను స్పష్టంగా చూస్తేను.

విశ్వ : (నవ్వి) ఆ... ఏదో యింటి గొడవలెండి.

పేర : అవునవును. నన్ను మీ గొడవల్లో పెట్టకండి. నాకు రావలసినడబ్బు అణా పైసలుతో పట్టుకెళ్ళటానికే వచ్చాను.

విశ్వ : చిత్తం

పేర : ఈ చిత్తం గిత్తం నాదగ్గర చెల్లదు. ఈ చేతులు నలిపే పద్ధతి నాదగ్గర చెల్లదు.

విశ్వ : అంతా అలా వుంటారా?

(యింతలో అన్నసూయ బయటికి వచ్చి పేరయ్య వుండటంగమనించి సిగ్గుతో లోపలకు వెళ్ళిపోయింది)

పేర : ఆఁ... అదేమిటి ? (వాకిలివంక చూస్తూ) ఆ అమ్మాయి నన్నుచూచి పారిపోయిందేమిటి ?

విశ్వ : ఏదో పనితొందరవల్ల.

పేర : అబ్బే! నేను రాగానే మీకు పనులు పుట్టుకొస్తయా ? నావిషయం ఆలోచించకుండా మారుపనులు చేసుకుపోతూవుంటే కూర్చోవటానికి నాకు తీరికలేదు.

విశ్వ : పెద్దవారు మీరు అలా అనుమానించగూడదు.

పేర : అవును. నేను పెద్దవాడినే కాదు. మునిసిపల్ కౌన్సిలర్‌నీ గూడాను. (ప్రేమను చూచి) ఓ చాలా ఆలస్యం అయింది. నేను మీటింగుకు వెళ్ళాలి. త్వరగా తేల్చు.

విశ్వ : యింకా రాలేదు.

పేర : యక్కడనుండి రాలేదంటావు?

విశ్వ : నాకు ఉద్యోగం దొరకలేదు.

పేర : అయితే నన్ను ఉద్యోగం యివ్వమంటావా యేమిటి ?

విశ్వ : ఉండటానికి ఇల్లు యిచ్చారుగా. ఉద్యోగంకూడా యిప్పించండి. మీ పుణ్యం ఎక్కడకు పోతుంది ?

పేర : నాకు యీ పాపపుణ్యాలమీద నమ్మకంలేదు. నేను మీకు యిల్లు అద్దెకు యిచ్చినది డబ్బుకొరకుగాని పుణ్యం కొరకుకాదు. మొన్న ఒకటే ఉద్యోగంవుంటే - అది నా పర్సనల్ శెక్రటరీ ఉద్యోగంలే. ఆ ఉద్యోగం కాస్తా ఒక అందమైన అమ్మాయిని పిల్చి యిచ్చా. అసలు ఉద్యోగాలు ఆడవాళ్ళు చేస్తున్నప్పుడే వుంది అందం.

విశ్వ : (నవ్వి) ఐతే,మీరు కౌన్సిల్ సభ్యులేకాకుండా రశికులు కూడాను.

పేర : (పెద్దగా నవ్వి) ఓరి నీ అసాధ్యంకూలా. ఏం గ్రహించావయ్యా ! యింత కుశాగ్రబుద్ధిగల్ల వాడికి ఉద్యోగం యెందుకివ్వ గూడదూఅంట ?

విశ్వ : అదే తమరు ఆలోచించాలి. ఇంతవరకు మీరు మునిసిపల్ కౌన్సిల్ సభ్యులు అయినట్టు నాకు తెలియదు.

పేర : తెలియదా ? అందుకనే నీకు ఉద్యోగం దొరకలేదు.

పేర : నేను మావార్డులో గెల్చినప్పుడు పదివేల రూపాయలు ఖర్చుపెట్టె. దేనికో తెలుసా ప్రతి టవునులోను పల్లెలోను ఆడవాళ్లను పిలిపించి యలక్షన్ ప్రచారంకోసం పంపించా. నీకు వింతగా లేదు ?

విశ్వ : లేకపోవటమేమిటి అసలు ఎన్నికల చరిత్రకే వక అపూర్వమయిన...

పేర : (మధ్యలో అందుకొని) చరిత్ర సృష్టించానంటావుకదూ. పత్రికలవాళ్లుకూడా అదే వ్రాసినారు. ఆ... అసలు విషయమే మర్చిపోయాను. ఆ రోజు ఆడవాళ్లు ప్రచారానికి వెళ్లితే నా ప్రత్యర్థికి డిపాజిట్టె గల్లంతు అయిందనుకో.

విశ్వ : (నవ్వి) భలే తెలివిగలవారండి మీరూ.

పేర : (నవ్వి) అనన్నివూ ఆమాటా. చూడు విశ్వనాథం నాయలక్షను ప్రచారం నా పెళ్లానికే నచ్చలేదయ్యా.

విశ్వ : గొప్పచిక్కే.

పేర : మా టవున్ కౌన్సిల్‌లో గొప్ప చిక్కులన్ని యిడదీసేది నేనే. కాని, నా పెళ్లాంవేశిన చిక్కుమాత్రం విడదీయలేకపోయినా. ఆరి దీనితల్లిముండ మొయ్యా అప్పుడు పోయింది పుట్టింటికి యింతమట్టుకు రాలేదు.

పేర : పోనిలే. రాకపోవటమే మంచిదయింది. చెప్పొద్దూ నేను పర్సనల్ శ్రకటరీనే పెట్టుకొన్నా.

విశ్వ : మంచిపని చేశారు.

(6)



పేర : పెద్దగానవ్వి. బుద్ధిమంతుడవోయి వుండునీకు మామునిసి. పల్ యేరియాలో యేదన్నా వుద్యోగం చూస్తాను. ఆఁ. బడిపంతులు ఉద్యోగంచేస్తా.

విశ్వ : బ్రతకలేని వాడికి బడిపంతుల ఉద్యోగంకన్నా వేరే దారేముంది?

పేర : ఆ. సరేకాని విశ్వనాథం. నాయింటిఅద్దెమాటేమిటి? నాకు త్వరగా కావాలి యేమంటావు? రేపుయివ్వాక తప్పదు.

విశ్వ : మీరలా పట్టుబడితే లాభంలేదు.

పేర : యీ లాభనష్టాల విషయం తర్వాత చూసుకోవొచ్చు. మొన్న చూశావు? వోరోడ్డు కంట్రాక్టు కొందరు వుంటే వొకతనికి యిప్పించా. అయితే వాడుయిస్తానన్న అయిదు వందలూ యింతవరకు యివ్వడే. డబ్బుకు చాలా చిక్కుగా వుంది

విశ్వ : మీరూ చిక్కుపడు తున్నారా ?

పేర : మొన్న కొందరు పాడుకపోయిన కంటాృక్టరు అయిదు వందలూ యెగవేశి వెళ్లిపోయాడు. చిక్కుగాక యింకే ముంది? నేను యింటికి తాళము వేశానని అనుకోకుండా ఆ యివ్వాలన్ని వందరూపాయిలు రేపుయిస్తే మంచిది.

విశ్వ : మీరూ వొత్తిడిపెడితే నేనేంచేసేది చెప్పండి?

పేర : నువ్వు చెప్పావద్దూ నేను వినావొద్దు ఆ... యేమం టావ్ రేపు యింటికి తాళం వెయ్యమంటావా? డబ్బు తెచ్చి యిస్తానంటావా ?

విశ్వ : (పలుకక బాధపడుతూ) సరే. మీయిష్టం.

పేర : నాయిష్టం అన్నందుకో మూడు నెలలు యింటి అద్దె అడగలేదు. యిదిగో! మళ్ళీ చెపుతున్నాను. కష్టపెట్టు కుంటే ప్రయోజనంలేదు. రేపు నువ్వు యివ్వాలి నేను వెళ్ళాలి. సరే! వెళ్ళిరానా! అవతల నాకు పనివుంది. పాకీ వెధవలు సమ్మె జేస్తామని నోటీసు యిచ్చారు. వాళ్ళకు ఒక్కదమ్మిడీ పెంచమని మీటింగులో ప్యాన్ చేయబో తున్నాం! అబ్బా! అన్నీ యిబ్బందులేనయ్యా! వెళ్తా!

(లేచి వెళ్ళిపోయాడు. విశ్వనాథం నిట్టూర్చాడు.)

(యింతలో మళ్ళీ అన్నపూర్ణ బయటికివచ్చింది ఏడుస్తూను. ఏదోచెప్ప బోతూ, చెప్పలేక ఊరుకుంది.)

విశ్వ : ఏమిటి ?

అన్న : పిల్లవాడికి జ్వరం ఎక్కువైపోతుంది.

విశ : వెధవ. ఎక్కడెక్కడో పడి దెబ్బలుతినివచ్చి నాప్రాణంతీస్తు న్నాడు. ఊఁ...పద...

(విసురుగలేచి లోనికి వెళ్లాడు. యింతలో రామారావు వచ్చాడు. వయస్సు 50 సంవత్సరాలుంటయి. తెల్లగ నెరసిన గడ్డం. సామాన్యమైన గుడ్డలు. చేతిలో సంచివుంది.)

రామా : అమ్మాయి. అన్నపూర్ణా?

అన్న : (వచ్చి) రా! నాన్నా! అంతా కులాసాగావున్నారా ?

రామా : ఆ...కులాసాగేవున్నాం. అదేమిటమ్మా అలా చిక్కి పోయావేం ? జబ్బుచేసిందా ?

అన్న : ఆ... (కన్నీళ్లు తుడుచుకుంటూ వెళ్ళిపోయింది)

(రామారావు మంచంమీద కూర్చున్నాడు. విశ్వనాథం లోపలనుండి వచ్చాడు).

విశ్వ : ఎంతసేపయ్యింది మామయ్యావచ్చి; అంతాబాగున్నారా!

రామా : ఆ...భగవంతునిదయవలన కులాసాగానేవున్నాను..
కాని. నువ్వూ చిక్కిపోయావేం? ఏమీ జబ్బుచేయలేదు కదా?

విశ్వ : అబ్బే! లేదండీ?

రామా : ఆ... లేకపోవటం ఏమిటి? అంతా అస్థిపంజరాలై పోయి. నీకు ఉద్యోగం దొరకలేదన్నమాట?

విశ్వ : ప్రయత్నిస్తూనే వున్నాను.

రామా : నీ ప్రయత్నం ఫలించేసరికి, ఎవరన్నా బ్రతికివుంటారా? అని.

(అన్నపూర్ణ పిల్లవాడిని తీసుకొచ్చింది. పిల్లవాడు జ్వరంతో మునగదీసుకుపోతూ అన్నపూర్ణ వెనకనే వచ్చాడు. రామారావునిచూచి)

కామేశం : తాతయ్యా! (అరుస్తూవెళ్ళి ఒళ్ళో వాలిపోయాడు)

రామా : ఏమిట్రా! తలకుదెబ్బ దేనికి తగిలింది? అబ్బా! వళ్లు గూడా మండిపోతున్నదే!

అన్న : జ్వరం తగులుతున్నది నాన్నా.

రామా : ఇంతపెద్ద దెబ్బ దేనికి తగిలింది? ఎక్కడ పడ్డావురా? కావుడూ!

కామేశం : మరే! ప్రొద్దునే (అన్నపూర్ణవంక చూచాడు)

(అన్నపూర్ణ చెప్పొద్దని సైగజేసింది)

రామా : ఆగి పోయావేంరః చెప్పవేం!

విశ్వ : దేనికి తగిలిందిరా! వెధవః ఎక్కడ ఎక్కి దూకాడో!

రామా : అంతేనా!

కామేశం : కాదు తాతయ్యాః(ఆగి) నన్ను మీ యింటికి తీసుకు వెళ్ళవూ?

రామా: తీసుకు వెళ్ళతాలే: వస్తావా?

కామేశం: ఓ: నాకు యిక్కడ ఏమీ బాగలేదు తాతయ్యా?

(అన్నపూర్ణ ఏదో ఆవేదన పడుతూ లోనికెళ్ళింది. త్వరగా)

రామా: యింత గాయం ఎట్లా తగిలిందిరా?

కామేశం: యిందాకే అమ్మ కొట్టబోతేనూ. పరుగెత్తబోయి కత్తిపీట మీద పడ్డాను.

విశ్వ: కొట్ట బోయిందా?

కామేశం: ఊ... నేనే ఆకలైతేను ఆ ప్రక్కింటి వాళ్ళ చెట్టుని రెండు జామకాయలు కోసుకు తిన్నాను. అందుకని అమ్మ దొంగతనం చేశానని కొట్టింది. (గారాబంచేస్తూ) నువ్వు చెప్పు తాతయ్యా! వారాసకి రెండు పూటలు, ఏట్లా తిని బ్రతికేది?

రామా: (తీక్షణంగాచూచాడు. విశ్వనాథంచూడలేక తలవంచుకున్నాడు)

రామా: వారానికి రెండు పూటలేన ఉంటుంది.

కామేశం: అందుకనేగా ప్రక్కింటివాళ్ళ జామకాయలుకోసుకు తింది. అసలు నాన్న యింటికే రావటంలేదు. పిచ్చాడు అయిపోయాడని అంతా నవ్వుతున్నారు. అమ్మ ఎప్పుడూ ఏడుస్తూవుంటుంది. (విశ్వనాథం నిలవలేక బాధగా లోపలికివెళ్ళాడు)

రామా: స్కూలుకు వెళ్ళటంలేదూ?

కామేశం: ఎట్లా వెళ్ళేది! స్కూలుకు జీతం కట్టలేదని హెడ్ మాష్టరు నాపేరు తీసివేశాడు. (అన్నపూర్ణ వచ్చింది కోపంగా)

అన్న: ఏమిట్రా? వట్టి వసపోసిన పిట్టలా దేనికి అట్లా వాగు తావు!

కామేశం : చూడు తాతయ్యా ! అమ్మకు నామీద విప్పుడూ కోపనే. నేను యిక్కడుండను. మీావూకు వచ్చేస్తాను. నన్ను తీసికెళ్ళవూ ?

రామా : (నిట్టూర్చి) హూ...తీసుకువెళతాలే !

అన్న : ముందు మీరు లేచి కాళ్లు కడుక్కోండి నాన్నా.

రామా : నా కాళ్ళు కడుక్కోవటానికేం లే! నువ్వు నా కోసం వంటప్రయత్నం చేయకు. వెంటనే యింటికి వెళ్ళాలి. నిన్ను తీసుకువెళదామనే వచ్చాను.

అన్న : అదెట్లా సాధ్యపడుతుంది నాన్నా. వారికి ఆరోగ్యం సరిగాలేదయ్యో. ఇక్కడ తిండీతిప్పలు చూచేవారులేరయ్యో. ఇప్పుడేం తొందరనాన్నా. (కన్నీళ్ళు తుడుచుకుంది)

రామా : (విచారంగా) అది కాదమ్మా ! వారానికి రెండుపూటలు తిండితిని. ఎట్లా బ్రతుకుతావు? (కోపంగా) ఆయన యిక్కడేం చేసి ఊళ్ళేలుతున్నాడు ? అంత జరక్కపోతే అతనే మన యింటికొస్తాడులే పద. వెళదాం ?

(విశ్వనాథం లోపలినుండి వాకిలివరకూ వచ్చి ఆగిపోతాడు)

యింకా నీది వట్టిభ్రమకాని, సంవత్సరంనుండిలేని ఉద్యోగం యివ్వాళ సంపాదిస్తాడా ! లోకం అతన్ని ఎలాగూ పిచ్చివాడిక్రింద జమకట్టారు. నువ్వూ పిచ్చిదానివై పోతున్నావేమిటి ?

అన్న : నాన్నా ! ... (దుఃఖంతో)

రామా : నీ నాన్నని యింక దేనికి కళ్ళు మూస్తావు ? చదువుకున్నవాడు పెళ్ళాం బిడ్డల్ని పోషించగలడనుకున్నాను. కాని, యింతటి అయోగ్యుడనుకోలేదు. వీధిలో అడుక్కు-

తినేవాడికన్నా ఆధారం ఉందిగానీ, నీకు ఏం ఆధారం వుందమ్మా బ్రతకటానికి ?

అన్న : అంత తొందరపడతావేం నాన్నా. మా ఒక్కళ్ళ నొప్పనే ప్రొద్దుపొడిచిందా !

రామా : (కోపం దుఃఖం రెండూ వచ్చాయి) యింకా తొందర పడుతున్నానంటావా ? కన్న కూతురు పస్తులతో కాలం గడుపుతోందని విని కడుపుతీపి పట్టలేక పరుగెత్తుకొచ్చాను. ఆకలిపట్టలేక పిల్లవాడు దొంగతనంకూడా నేర్చుకున్నాడుగా?

అన్న : (ఏడుస్తూ) కావుడు చెప్పాడా?

రామా : వాడు చెప్పటం దేనికి ? వాడి తలే చెపుతుంది. (వాకిలివైపు చూచి) ఏం, విశ్వనాథం. అమ్మాయిని తీసుకెళ్ళ మని ఉత్తరం వ్రాశావుగా ! తీసుకువెళ్ళమంటావా ?

అన్న : (దుఃఖాశ్చర్యాలతో) మీరు ఉత్తరం వ్రాశారా !

విశ్వ : (సమాధానం చెప్పలేక పోయాడు)

రామా : అలా మౌనంగా కూర్చుంటే లాభంలేదు. అటో యిటో తేల్చిచెప్పు. పెద్ద చదువుచదివావనే గర్వమే నిన్ను పాడుచేసింది. కూలివాడు పెళ్ళాంబిడ్డల్నన్నా పోషిస్తున్నాడు కాని, మన దగ్గర ఆ సమర్థతా లేదు. దేనికి వాళ్ళనట్లా చంపుతావు? (కోపంగా) చచ్చేవాడివి నువ్వే చస్తేపోయేదిగా? చెట్టుకొమ్మ చెట్టుకు బరువౌతుందా ?

అన్న : (కోపంతో) నాన్నా... (భోరున ఏడ్చింది)

విశ్వ : అనూ. అదేమీ లాభంలేదు. లే. ఊరుకో; మీ నాన్న అన్నమాటే నిజం. నేను అసమర్థుడిని. నా చదువుయొక్క ప్రతిఫలం దేశంయొక్క సౌభాగ్యంమీద ఆధారపడివుంది.

స్వరాజ్యంవచ్చినా నా లాంటి చదువుకున్నవాడికి ఉద్యోగం దొరక్కపోవటమే స్వదేశ దౌర్భాగ్యానికి చిహ్నం. (ఆగి) నేను గొప్పవాడినౌదామనే చదివాను. నా భార్యాబిడ్డలకు కడుపునిండా తిండిపెడదామనే చదివాను. ఈ చదువుకు, నా బ్రతుక్కూ గ్యారంటీ వుంటుందనే నా పిత్రార్జితం చదువుకోసం తగలేశాను. (కన్నీళ్ళు రాలాయి) కాని, నా లాంటి వాడి బ్రతుకు యింతలోనే యింత భయంకరమై పోతుందనుకోలేదు. కూలివాడికన్నా రూపాయి సంపాదిస్తా ననే ధైర్యముంది. నాకు అదీలేదు. లాటరీ మీద ఆధారపడ్డ నష్టజాతకుడిలా వుంది నా పని. (కన్నీళ్ళు తుడుచుకొని) వెళ్ళిరా! కన్న కడుపుని క్షోభపెట్టడం మంచిదిగాదు.

రామా : (మెల్లగా లేచివెళ్ళి అప్యాయంగా భుజంమీద చెయ్యివేసి నిము రుతూ) అదికాదు నాయనా! నేను అలా అనలేదు. ఆ పిల్లనీ, నిన్ను చూస్తే నాకు మతిపోయింది. నేను నీ మంచి గురించే చెప్పాను. నేను మాత్రం లక్షాధికారిని కాదుగా? ఏదో బడిపంతులు ఉద్యోగంతో బాధపడుతున్నవాడినే. నీవు వ్రాశావుకాబట్టి పదిరోజులు పిల్లని పిల్లవాడినీ ఉప శాంతికోసం తీసుకువెళతాను. నువ్వు తొందరగా ఎక్క డన్నా ఉద్యోగం చూచుకుని నీ భార్యా బిడ్డల్ని తీసుకు తెచ్చుకో!

విశ్వ : (నిట్టూర్చి) అలాగే. (వెళ్ళిపోయాడు. కళ్లు తిరిగినై. చాపచుట్టుగా పడ్డాడు. రామారావు పట్టుకున్నాడు. అన్నసూయ ఏడుస్తూవచ్చింది. కామేశం నాన్నా...అంటూ మంచంమీదనుండి లేచాడు మరి.

(తెరపడింది.)

# ద్వితీయ రంగం

—( తెర )—

(అది రామారావుగారి. యిల్లు. ఎదురుగా వాకిలి. వరండాలో పెద్ద వస్తువులేమీ లేవు. ఒకమంచం మాత్రంవుంది. రామారావు విసుక్కుంటూ వచ్చాడు. చేతిలోవున్న పుస్తకం విసురుగా మంచం మీద పడవేసి, పైపంచ పడవేసి కూల బడ్డాడు. అన్నపూర్ణ వచ్చింది)

రామా : అమ్మాయి కాసిని మంచినీళ్ళు అందుకో అమ్మా; వెధవ వుద్యోగం. ఈ బడిపంతులుఉద్యోగం చేయుటంకన్న బజార్లవెంట అటుకులు అమ్మటం నయం.

అన్న : ఏం జరిగింది నాన్నా?

రామా : ఆ... బడిపంతులు అనగానే ప్రతివాడికీ లోకువే. బడిలోకి పిల్లలు రాకపోతే పంతులేది తప్పా? పిల్లల్ని బడిలోకి పంపాలనే జ్ఞానం పెద్దవాళ్ళ కుండాలిగాని. నేనేం చేస్తాను. పోనీ, ప్రభుత్వమైనా నిర్బంధవిద్యావిధానం ప్రవేశ పెడుతుందా అంటే ,అదీ లేదు. అన్నిటికీ మా చావు కొచ్చింది. వెధవ నలభై రూపాయలు యిస్తున్నారు కాబట్టి ఈదిక్కుమాలిన బరువంత మేమేభరించాలి.

అన్న : అంతకష్టంగావుంటే ఆ ఉద్యోగంమానేయరాదునాన్నా.

రామా : మానేస్తే బ్రతికేమార్గం ఏముంది?

అన్న : ఏదన్నా క్రొత్త ఉద్యోగం...

రామా : ఈ పాతఉద్యోగం ఊడదియ్యకుండావుంటే క్రొత్తది యిచ్చినంత పుణ్యం. ఆ...అదేమిటమ్మా! అల్లుడు దగ్గర నుండి యింకా ఉత్తరమన్నా రాలేదు.

అన్న : (సమాధానం చెప్పలేక ఊరుకుంది.)

రామా : పదిరోజులైందిగదా వచ్చి. అక్కడ ఏం చేస్తుంది? ఎక్కడవుంటుంది? ఆరోగ్యం విషయం. అన్నీ ఒక్క ఉత్తరంముక్క వ్రాస్తే అతనిదేంపోయింది.

అన్న : పనితొందరలో మరచిపోయివుంటారు. వచ్చేనాడు పిల్లవాడికి జ్వరంతగిలినసంగతి వారికి తెలియదా? చేతిలో డబ్బులేక అవస్థపడుతున్నారేమో?

రామా : ముక్కానీ పోస్టుకార్డువేయలేకపోతే యింకా అతను నిన్ను ఏం పోషిస్తాడు. (తలపట్టుకుని బాధగా) అమ్మాయి కాస్త అమృతాంజనం పట్టుకురా. తల బాధగావుంది.

అన్న : అట్లాగే నాన్న.

(లోనికి వెళ్ళిపోయింది. యింతలో రామ్మూర్తి వచ్చాడు. పల్లెటూరి షాహుకారు. కోరమీసాలూ, మంచి బలమైనవాడు. వయస్సు 40 సంవత్సరాలు పైనుంటయి. కోపంతో వచ్చాడు)

రామ్మూర్తి : (వస్తూ) రామారావుగారూ?

రామా : దయచేయండి. రండి. (మంచం మీదనుండి లేచాడు)

రామ్మూర్తి : ఏమయ్యా! (గర్జిస్తూ)నువ్వు కడుపుకు అన్నం తినటంలేదు. దేనికి మాపిల్లవాడిని అట్లా కొట్టావు?

రామా : (భయంగా) ఏం చేయమంటారండీ: పరీక్షలు దగ్గర కొస్తున్నయి. ఒకనాడూ స్కూలు కు(రాడు. ఆ దేవాలయాల్లో కూర్చుని చీట్ల పేకలు, సిగిరెట్లు (తాగటం. పిల్లలు లేరని పైఅధికార్లతో నాకు తాకీదు. నేను భయపెట్టాను గాని, కొట్టలేదండీ. (వినయంగా)

రామ్మూర్తి ! ఛీ. యింకా అబద్ధమాడతావు ? పిల్లవాడి శరీరం అంతా కందిపోతేను, ముఖంఅంతా వాచిపోతేను.

రామా : అబ్బే! నేను అంతదెబ్బలు కొట్టలేదండీ! అతను చెడి పోతున్నాడని....

రామ్మూర్తి : చెడిపోతే మా పిల్లవాడే చెడతాడు. నీ తాత గాడి సొమ్మేంపోయింది ? నిన్ను చదువు చెప్పమన్నాంగాని, చావగొట్టమన్నామా ? అసలు భయపెట్టడానికిమాత్రం నీ కేం అధికారంవుంది ? ఎన్నడూ పిల్లవాడిని మేమన్నా చెయ్యిచేసుకోలేదే ? నువ్వేం మనిషిజన్మ ఎత్తలేదూ ?

రామా : రామ్మూర్తిగారూ! మీరు అనవసరంగా దేనికి నోరు చేసుకుంటారు. నా కర్తవ్యాన్ని నేను చేశాను. పిల్లవాడి చెడుకు తల్లిదండ్రులెంత బాధ్యతుందో బడిపంతులు బాధ్యతా అంతేవుంది.

రామ్మూర్తి : నీ బాధ్యత ఎవడడిగాడు. నువ్వు పిల్లవాడిమీద చెయ్యి దేనికి చేసుకున్నావో ముందుచెప్పు. నిన్ను ఈ పళంగా పట్టుకొని తంతే దిక్కెవ్వరూ ?

రామా : మీకు న్యాయమనితోస్తే అలాగే చేయండి !

రామ్మూర్తి : ఏముంది రోషంలేకపోయినాక. అసలు నీలాంటి దౌర్భాగ్యుడి దగ్గరకు పిల్లవాడిని చదువుకు పంపటం నాదే

తప్పు. వెధవ నీ బ్రతుకెంతా? నువ్వెంతా? నాలాంటి మోతుబరి రైతు కొడుకుని కొట్టే అధికారం ఎవడిచ్చాడు? నీ రోజులుమంచివై బ్రతికిపోయావు. పో! ఈసారి యిలాంటి పనిచేశావా! జాగ్రత్త!

(రివ్వునా వెళ్లాడు విసురుగా. యింతలో అన్నపూర్ణ అమృతాంజనం డబ్బాతో వచ్చింది.)

అన్న: దేనికినాన్నా! నీకీ తాపత్రయం? ఎవరు చదివితే నీకేం, చదవకపోతే నీకేం? నువ్వు వాళ్ళపిల్లల్ని బాగు చెయ్యాలన్నా వాళ్ళకు రుచించకపోయె. దేనికి వాళ్ళచేత మాటలు పడటం!

రామా: ఈ బడిపంతులు బ్రతుకే అది. నా ఉద్యోగ ధర్మం నేను నిర్వహించాను. నాస్కూల్లో పిల్లలు పట్టి భ్రష్టులైపోయా రంటే నా మనస్సు అంగీకరించదు.

అన్న: ఆ ఆలోచన వాళ్ళకు లేదు. కుక్క తోక వంకర తీయగలమా? ఏమిటో! మన పట్టుదలే గాని, వాండ్లకుం డొద్దా ఆ శ్రద్ధా భక్తీనీ:

రామా: అలా అనకూడదమ్మా? ఎవరో చెడ్డవాళ్ళని మనం చెడువాళ్ళం కాకూడదు. మన విధ్యుక్త ధర్మాన్ని మనం నెరవేర్చకపోతే భగవంతుడు మెచ్చడమ్మా!

(ఉత్తరం పట్టుకుని కామేశం వచ్చాడు త్వరగా)

కామేశం: అమ్మా! నాన్న వుత్తరం వ్రాసేడే: తాతయ్యా! ఉత్తరం వచ్చింది.

అన్న: (ఆతృత సంతోషంతో) నేను చెప్పలేదు నాన్నా: వారికి తీరిక లేక ఆలస్యం అయి వుంటుందని. . .

రామా : (ఉత్తరం విప్పి చదువుతూ) విశ్వనాథం కాదమ్మా వ్రాసిం ది. ఎవరో కాంతారావట వ్రాశాడు.

అన్న : (నెత్తిమీద పిడుగు బడ్డట్టుగా అయింది. ముఖం నల్లబడింది. దుఃఖం గూడా వచ్చింది) కాంతారావా !

రామా : యిదిగో! చదువు. అల్లుడి ప్రయోజకత్వం, నేను చెప్పలేదూ! అతనివల్ల ఏమీ ప్రయోజనం లేదనీ:

(విసుగ్గా ఉత్తరం అన్నపూయకిచ్చాడు)

అన్న : ప్రియమైన

చెల్లెలు అన్నపూయకు,

నీవు పుట్టింటికి వెళ్ళినదగ్గర్నుండీ విశ్వనాథం పరిస్థితి ఆందోళనకరంగావుంది. ఇంటిపట్టునే ఉండటంలేదు. ఏమైనా నువ్వు మీ నాన్నగారితో చెప్పి విశ్వనాథాన్ని మీ దగ్గరకు తీసుకువెళ్ళటం శ్రేయస్కరం. ఈ దారుణమైన పరిస్థితిలో అతను ఆత్మాభిమానంకోసం, గాలికి తెగిన గాలిపడగలా, పరిస్థితులు అనుకూలించకపోతే ఏమౌతుందోనని చింత పడుతున్నాము. జాగ్రత్తపడమని నా మనవి. అందరి క్షేమంతో...

ఇట్లు,

నీ అన్నయ్య

కాంతారావు.

10—6—1953.

(ఉత్తరం పూర్తిచేసేసరికి అన్నపూయ దుఃఖం పొంగిపోయింది. పట్టలేక నోట్లో మీరవెంగు కుక్కుకొని లోనికి వెళ్ళింది)

(కొద్దిసేపు రామారావు శిలాప్రతిమయ్యాడు. కామేశంగూడా లోపలకు వెళ్ళాడు. యింతలో ప్యూన్ శీతారామయ్య వచ్చాడు.)

శీతా : రామారావుగారూ !

రామా: (తలెత్తి)ఎవరు ? ఓ!శీతారామయ్యా! రా! ఏమిటికబుర్లు?

శీతా : యిన్సపెక్టరుగారొచ్చారండీ ! స్కూల్లో వున్నారు. తమర్ని రమ్మంటున్నారు !

రామా : ఎప్పుడు వచ్చారు ?

శీతా : ఇప్పుడే వచ్చారు. ఇవ్వాళ తమరింటివద్దనే భోజనం ఏర్పాటు చేయమన్నారు.

రామా : సరే! వస్తా! పద.

శీతా : మీరు త్వరగా రండి. (వెళ్ళాడు)

రామా : అమ్మాయి! అన్నపూర్ణా!

అన్న : (వచ్చింది) ఏమిటి నాన్నా !

రామా : ఇవ్వాళ యిన్సపెక్టరుగారు భోజనానికి వస్తారట! త్వరగా వంట చేస్తావా ?

అన్న : ఇంట్లో ఏమీలేవు నాన్నా. రాత్రితోనే బియ్యం చిల్లర సరుకులూ అయిపోయినై. త్వరగా పంపించండి.

రామా : సరే ! పంపిస్తాలే !

(లోపలకువెళ్ళి కోటువేసుకుని, తలగుడ్డ చుట్టుకొని త్వరత్వరగా వెళ్ళిపోయాడు)

అన్న : ఏరోయ్, కావుడూ ! ఏం చేస్తున్నావురా ?

కామేశం : (వస్తూ) అమ్మా! విన్నావుటే ! ఆ కాంతమ్మ...

అన్న : ఏ మందిరా ?

కామేశం : నాన్నను తిట్టింది.

అన్న : దేనికి ?

కామేశం : మానాన్న తిండిపెట్టలేక ఇక్కడకు పంపించాడటగా? అంటూ దీర్ఘాలు తీసింది.

అన్న : ఊఁ... (ఏడుపొచ్చింది)

కామేశం : కూటికిలేక పుట్టింటికొచ్చింది అన్నసూయ, అని అందరితో చెపుతోంది.

అన్న : సరేలే! పో! ( కన్నీళ్ళు తుడుచుకుంది )

కామేశం : మనం నాన్నదగ్గర కెప్పుడెళదాం?

అన్న : ఎప్పుడెళదాం?

(నిట్టూర్చింది. ఆ ప్రశ్న తనే వేసుకొని ఏడుస్తూ వెళ్ళిపోబోయింది. రామారావు మళ్ళీవచ్చాడు విచారంగా)

ఏమైంది నాన్నా!

రామా : ఆఁ... ఏమౌతుంది. నేను సరిగా పనిచేయడంలేదని రిమార్కు వ్రాశాడు. (కూలబడ్డాడు మంచంలో)

అన్న : వారికి వంటప్రయత్నం చేయొద్దా నాన్నా?

రామా : వంటవద్దు గింటావద్దు. కావాలంటే పోయి హోటల్లో తింటాళ్ళే. గవర్నమెంటుదగ్గర టి. ఏ. పుచ్చుకోవటంలా?

అన్న : యిందాక చెయ్యమన్నారుగా?

రామా : అక్కరలేదులే వెళ్ళు. (విచారంగా తలపట్టుకున్నాడు)

అన్న : చెల్లాయి అమ్మా వాళ్ళు ఎప్పుడొస్తానని వ్రాశారు?

రామా : యింక రెండు మూడు రోజులుంటారట. నువ్వు రాలేదని మీ మేనత్తయ్య కోప్పడిందట.

అన్న : కోపాలకేంలే. యింట్లోవున్న వాళ్ళంతా వెళ్ళాలా. అమ్మా, అన్నాయి, చెల్లాయి వాళ్ళు వెళ్ళారుగా!

(పోష్టు జవాను వచ్చాడు)

పోష్టు : సార్ !

రామా : ఎవరూ?

పోష్టు : నేను పోష్టుజవాన్ని. మీకు వుత్తరాలు వున్నయి.

రామా : (వెళ్ళి వుత్తరాలు తెచ్చాడు. కూర్చుని చించి చూచుచున్నాడు. నిలువునా నీరయ్యాడు. మతిపోయిన వాడిలాగ అయిపోయాడు)

యిదీ పోయిందీ?

అన్న : ఏమిటి నాన్నా అది? ఎక్కడనుంచి?

రామా : బోర్డునుంచి వచ్చింది. నన్ను ఈ బడివంతులు ఉద్యోగంనుండి తీసివేశారు.

అన్న : దేనికీ ?

రామా : నేను ఉపాధ్యాయ సంఘాల్లోచేరానట, ప్రభుత్వాన్ని ధిక్కరించానట.

అన్న : అయ్యో ! అన్యాయమా !

రామా : అన్యాయంగాక లోకంలో న్యాయం యెక్కడున్నది ? యిదిగో చదువు !

అన్న : "మీరు ఉపాధ్యాయ సంఘాల్లో చేరి ప్రభుత్వాన్ని ధిక్కరిస్తున్నారు. పిల్లలకు విద్యావిధానంమీద నమ్మకం లేకుండా చేస్తున్నారు. మీరు ప్రభుత్వానికి విధేయులుగా వుండక, ధిక్కరించిన నేరానికి మిమ్మల్ని ఆ బోర్డుస్కూలు నుండి తీసివేయుటం జరిగింది."

(కళ్ళనుండి ధారాపాతంగా నీరు కారాయి)

రామా : ఇంత యీ కుటుంబాన్ని ఎలా పోషించేది ? యింత మందినీ తిండికి ఎలా చంపేది ! ఛీ. వెధవబ్రతుకు. వెధవ ఉద్యోగాలు. నీతిగా బ్రతికేవాడికి కూడేది ?

(లేచి విసురుగా వెళ్ళాడు యింట్లోకి. అన్నపూర్ణ ఏడుస్తూ వెళ్ళింది)

( తెరపడింది )

# తృతీయ రంగం

—( తెర )—

(అది విశ్వనాథం గృహమే అంతా వెనుకటి సీను. వెంకటేశం యింటికి తాళం వేస్తువుంటాడు. పేరయ్య వచ్చాడు. ఈసారి మరవిలువైన గుడ్డలు ధరించాడు. చేతిలో వెండిపన్ను కర్రవుంది)

పేర : ఏయ్. ఎవరునువ్వు యిక్కడ ఎందుకున్నావు. ఏం చేస్తున్నావు?

వెంక : ఏమిలేదు.

పేర : లేకపోవటమేమిటి? యింటి తాళంతీస్తూ.

వెక : తీయటంలేదు. వేస్తున్నాను.

పేర :విశ్వనాథం ఎక్కడకెళ్ళాడు?

వెంక : బజారు కెళ్ళాడు

పేర : నువ్వెందుకున్నా విక్కడ ?

వెంక : పనివుండి.

పేర : పనా? యిక్కడ నీకు పనిఎవడిస్తాడు. అక్కడ జీతాలు చాలటంలేదని పాకీవాళ్ళు సమ్మెచేశారు. దేశభక్తులంతా తట్టలు పుచ్చుకుని బయలుదేరారు దొడ్లూ, రోడ్లు వూడవటానికి! నువ్వూవెళ్ళక యిక్కడ ఏంచేస్తున్నావు?

వెంక : పూలరంగడికిమల్లే ఈ వీధులవెంట తిరక్కపోతే నువ్వూ పూడి స్తేపోయేదిగా!

పేర : ఏమిటీ? పూలరంగడినా! ఓరి నీఅసాధ్యంకూల. ఏంగ్రహిం చావోయి. అందుకనే పిల్లలబుద్ధి పాదరసం లాంటిదంటారు! యిదిగో అణా పెట్టి బటానీలుకొనుక్కో. నేను పాకీవాళ్ళకే అణా పెంచలేదు మునిసిపల్ కౌన్సిల్ సభ్యుడనై యుండి. వెధవలు జీతాలు చాలటం లేదంటారు. ఒకడు నాకుపెళ్ళాం కావాలంటాడు

వెంక : అబ్బే! వాళ్ళు జీతాలుపెంచమన్నారు గాని, పెళ్ళిళ్ళు చేయమనలేదే:

పేర : అనలేదూ? వాళ్లు అనక పోయినా వాళ్ళబుద్ధులే చెపు తున్నాయి. సాయంత్రం అయ్యేసరికి ప్రతిపాకీ వెధవ తళతళ లాడేగుడ్డలతో పెళపెళలాడతూ బయలుదేరుతారు. అందు కేగా వాళ్ళు సమ్మెచేసేది! చెయ్యని వాళ్ళుచచ్చినా అణా పెంచవద్దని కౌన్సిల్ మీటింగులో ప్యాస్ చేయించాను.

వెంక : అంతా మీరేచేసినట్లు చెపుతున్నారే?

పేర : నేను చెయ్యకపోతే యింకెవడు చేస్తాడు. వున్నారులే. యిద్దరు మాకౌన్సిల్లో కమ్యూనిష్టులు వాళ్ళు తీర్మానం తెస్తే ఓసిపారవేయించాను. అదిసరేగాని, పాకీవాండ్లంటే బుద్ధిలేదనుకో. వీండ్లకేమిపొయ్యేకాలం వచ్చిందంటూ యీ చదువుకున్నవాండ్లంతా నిరుద్యోగులమంటూ, వీధు లంట జంటలతో తిరుగుతున్నారేం? యివ్వాళ నిరుద్యోగు లట ఆ చదువుకున్నవాళ్ళు వీధులంట సిగ్గులేకుండా ఊరే గుతున్నారు?

వెంక : రేపు మేమూ ఊరేగబోతున్నాంగా ?

పేర : మీరూనా ! మీదేసంఘం ?

వెంక : మాది ప్రెస్‌వర్కర్సుయూనియన్. మా మేనేజర్లు సరిగ్గా జీతాలు యివ్వటంలేదు. పనిలోనుండి తీసివేస్తున్నారు. అందుకని సమ్మెచేస్తున్నాం. యింకా చేస్తాం గూడాను.

పేర : ఓరి దిక్కుమాలిన ముండాకొడుకల్లారా ! మా ప్రభుత్వాన్ని పడదొయ్యాలని చూస్తున్నార్రా !

వెంక : మీ ప్రభుత్వం వుంటే ఎవడికికావాలి పోతే ఎవడికి కావాలి. మీరేం మాకు జీతాలు పెంచారా ? పని గ్యారంటీ యిచ్చారా !

పేర : అరె! కుర్రవాడివైనా చాలా చురుకుగా మాట్లాడుతున్నావే. అగ్నిసాక్షిగాపెళ్ళాడినా నాపెళ్ళామే నన్నువిడిచిపెట్టివెళ్ళిపోయింది. నీకుపనిగ్యారంటీ ఎవడిస్తాడు?

వెంక : ఏయిల్లాలు చేస్తుందయ్యా నీతో కాపురం. యిట్లా వీధు లెంటపడ్డావు.

పేర : ఆరీ. నీతాడుతెగ నువ్వు పెద్ద దార్జన్యవాదిలాగున్నావే చూస్తే.

వెంక : గుడ్డివాడికంటికి గుడ్డిగాకాక ఎట్లాకనుపిస్తుందీ ప్రపంచం

పేర : అరే! అణాయిస్తానన్నా అభిమానం గూడా లేదేనీకు

వెంక : ఎవడికి కావాలీ. నీముష్టిఅణా.

పేర : ఆ. ఆ. డబ్బుని తిట్టకు. 'ధనం దైవస్వరూపం' అన్నారు పెద్దలు. అదిసరేకాని, మీయజమాని ఎక్కడికి వెళ్ళాడు.

వెంక : నాకుఆయన యజమానిగాదు. స్నేహితుడు. దేనికి!

పేర : దేనికైనా. చొప్పదంటు ప్రశ్నలు వేయకు. ఆయన ఎక్కడికి వెళ్ళాడో చెప్పు !

వెంక : చెపితినిగా? ఆయన నిరుద్యోగుల సంఘంలో జేరి మంత్రి గారిదగ్గరకు రాయబారం వెళ్ళారు. ట్రావెలర్సు బంగళా దగ్గరకు.

పేర : అయితే యిందాక ఊరేగిన గుంపులో విశ్వనాథంగూడా వున్నాడంటావు ?

వెంక : అంతా విశ్వనాథంలే గదండి వాళ్ళు అదొక నిరుద్యోగుల విశ్వరూపం అందుకనే నిన్ను గుడ్డివాడనేది!

పేర : అన్నావ్రా? ఆమాట. నేను వుంచుకున్న ముండగూడా నాకు, ''రేచీకటి'' వచ్చిందని అంది. మీరంతా చదవకుండా డాక్టర్లైపోతున్నారు.

వెంక : అక్కర లేదు. నీవాలకం చూస్తేనే తెలుస్తుంది.

పేర : ఏయ్. జాగ్రత్తగా మాట్లాడు. నేను మునిసిపల్ కౌన్సిల్ సభ్యుడిని.

వెంక :అయితేనాకేం లావనుకున్నావా !

పేర : ఓరేయ్ గాడిద. చిన్ననోటికి పెద్దమాటలురా? ఏదీ ఆ తాళంచెవి యిట్లుతే.

వెంక : యివ్వను.

పేర : తే ముందు. (కోపంగా)

వెంక : యివ్వనన్నాను అంతే.

పేర : ఏమిట్రా నువ్వు యిచ్చేది (చేతిలోది లాక్కుని బలవంతాన) వెధవ. పిండారీవెధవ. ఈ యింటికి. ఘివ్వవలసిన బాడుగ

కట్టి యింటి తాళం తీయమను. తెలిసిందా!

వెంక : ఏమిటీ దౌర్జన్యం. ...

పేర : పోయిచెప్పు: తాళంతీశారా జైల్లో తోయిస్తాను.

వెంక : అదీ చూస్తాంలే వెళ్ళు.

( విశ్వనాథం వస్తాడు )

పేర : యిదిగో విశ్వనాథమూ. మాయింటి అద్దెయిస్తావా లేక యిల్లు ఖాళీచేస్తావా?

విశ్వ : పేరయ్యగారూ! అంత తొందరపడితే యేలాగండి,

పేర : మూడునెలలు అద్దెబకాయిపెట్టి యింకా సిగ్గులేకుండా మాట్లాడుతావు.యివ్వాళ పెళ్ళాన్ని పుట్టింటికిపంపేవు రేపు నువ్వూ జారుకుంటావు మెల్లగా నేను యవర్ని అడిగేది యింటి అద్దె.యింటికి తాళంవేశాను. నా వందరూపాయలు అక్కడపెట్టితే యింటి తాళం తీస్తా. లేకపోతే వెళ్ళిపో. తరవాత నీ యిష్టం అంటూ (యిసురుగా వెళ్లేడు)

విశ్వ : పేరయ్యగారు ! పేరయ్యగారూ !

వెంక : హృదయం లేనివాణ్ణి నీవు ప్రాధేయపడితేమటుకు యేం లాభం.

విశ్వ : (వెళ్లి విచారంగా మంచంమీద కూలబడ్డాడు)

వెంక : అక్కదెగ్గరనుండి వుత్తరం వొచ్చినది.

(వెంకటేశం వుత్తరం యిచ్చాడు)

విశ్వ : (గబగబా వుత్తరాలు చించి చదువుకొన్నాడు)

వెంక : యేమి వ్రాసినది అక్కయ్య. యెప్పుడు వస్తానన్నది ?

విశ్వ : యిదిగో చదువు. నాకు కళ్లు కనిపించిటంలేదు.

(వెంకటేశంకు యిచ్చినాడు)

వెంక : (గబగబా వుత్తరం తీసుకొన్నాడు)

ప్రియమైన భర్తగారికి

మీ అన్నసూయ.

పుట్టెడు దుఃఖాన్ని నెత్తిన వేసుకొని పుట్టింటికి వచ్చిన దగ్గరనుండి నా మనస్సంతా మీ దగ్గరనేవుంది. యిక్కడ మా నాన్నగారికి నాలుగురోజులనుండి వొంట్లో కులాసాగా లేదు. వారికి టైఫాయిడుజ్వరం మళ్ళా తిరగపెట్టినది. యీ నెల రావలసిన జీతం రాలేదు. వుద్యోగం కాస్తా వూడిపోయింది. వారు మనోవ్యాధితో మంచం పట్టేరు. యిక్కడకు వొచ్చినప్పటినుండి కాముడికి జ్వరం తగులుతూవున్నది రాత్రిపూట మిమ్మల్ని గురించి కలవరింతలుపెడుతూవున్నాడు. నలుగురూ నన్ను గురించి నవ్విపోస్తున్నారు. క్షణమొక యుగంగా మీ రాకకోసం కన్నీళ్ళతో కాలం గడుపుతుయున్నాను. రెండు రోజులలో మీరువొచ్చి నన్ను తీసుక వెళ్ళకపోతే నేను రావలసి వొస్తుంది. మీకు ఆరోగ్యం బాగాలేదని విన్నాను. మీ ఆరోగ్యాన్ని కాపాడుకోని మమ్మల్ని యిలా నవ్వులపాలు చేయక మీ సాన్నిధ్యానికి తీసుక వెడతారని ఆశ.

ఇట్లు

మీ అన్నస్సూయ.

వెంక : (వుత్తరం క్రిందపడేసి యేడుస్తు ముఖం కప్పుకొన్నాడు)

విశ్వ : ఊరుకో. ఏడవకు. కన్నీళ్ళతో మనస్తాపాన్ని ఎంతకాలం చల్లార్చుకొంటాం

వెంక : నువ్వు ఒక్కసారి వెళ్ళిరాగూడదూ!

విశ్వ : ఎలా వెళ్ళేది? ఉద్యోగం దొరకలేదు. మామగారికి వున్న ఉద్యోగంపోయింది అంతా నిరాధారులమైపోయినాం

వెంక : మీరు వెళ్ళిరాకపోతే వాళ్ళు చిక్కున పడతారు.

విశ్వ : జీవితం అంతా చిక్కులే! ఎలా వెళ్ళేది? బండి చార్జీలన్నా కావద్దు?

వెంక : నేను ఎక్కడన్నా తెచ్చియిస్తాను.

విశ్వ : సరే! ఆలోచిస్తాలే వెళ్ళు.

వెంక : నేను ఆస్పత్రికి వెళ్ళిరావాలి. నాన్నగారు కబురు చేశారు. రాత్రికి మాయింటికి రా పడుకోవచ్చు. ఈ దుర్మార్గుడు యింటికి తాళం వేసుకు వెళ్ళాడు.

విశ్వ : సరే! (నిట్టూర్చాడు)

వెంక : వెళుతున్నాను. (వెళ్ళాడు త్వరగా. కాంతారావు వచ్చాడు.)

కాంతా : ఏమిట్రా అట్లా విచారంగా వున్నావు?

విశ్వ : ఏమీలేదు. చావటానికి మార్గందొరక్క.

కాంతా : ఛా. ఏమిట్రా అది? యివ్వాళ కొత్తగా మాట్లాడుతున్నావేమిటి?

విశ్వ : ఈ జీవితానికి క్రొత్తా పాతా అంటూ లేదు. అంతా నరకమే. వెధవబ్రతుకు ఎంత అసమర్థపు బ్రతుకైపోయింది. యిదిగో చదువు. (ఉత్తరం యిచ్చాడు కాంతారావుకు)

కాంతా : (చదివి) అంతా అయోమయంగా వుందేమిటి? చివరకు ఆయన ఉద్యోగంకూడా వూడిపోయిందా?

విశ్వ : యిక ప్రపంచంలో బ్రతికేమార్గం ఎక్కడ? చావుకంటే సులభమైనది ఏముంది?

కాంతా : చాల్లే! వెధవచావు కోరికలూ నువ్వూనూ. కష్టం వచ్చినప్పుడే ధైర్యంగా వుండాలి. మన సంఘాలు బలపడుతున్నయి. మన ఆందోళన ఫలించి మనం ఆత్మవిశ్వాసంతో కృషిచేస్తే మనకు మంచిరోజులు రాకపోవు. నిరాశపడి ఏం సాధిస్తాంరా? చూడు వెంకటేశం నీకుమల్లే నిరాశపడ్డాడా! అతనుమాత్రం కుటుంబంతో బాధపడటం లేదూ? దేనికైనా ధైర్యం ప్రధానం. (పచార్లు చేస్తున్నాడు)

విశ్వ : మాటలకూ, జీవితానికీ ఎంతో తేడావుంది. గోతిలో మునిగిపోతున్న వాడికి నీమాటలు రుచిస్తయా? (నిట్టూర్చి)

కాంతా : నేనుమాత్రం నీలాంటి నిరుద్యోగినేగా.

విశ్వ : అయినా! నీపరిస్థితి వేరూ! నాపరిస్థితి వేరూ! నాలాంటి భయంకర సంఘటనలే నిన్ను ఎదుర్కొంటే తెలిసేది.

కాంతా : అవును. నాభార్య చనిపోవటం, అప్పులవాళ్ళు జైల్లో పెట్టించటం. నిలవ నీడలేకుండా అనేకరోజులు పార్కుల్లో బ్రతకటం. చివరకు మృత్యువుమీద ఎదురుతిరిగి నిలవటం అంతా నీజీవితానికీ నాజీవితానికీ వేరేనా! ఆనాడు నీలాగ నేను చావాలనుకోలేదే? యిందాక మంత్రిగారు చేసిన వాగ్దానంమరచి పోయావా?

విశ్వ : మంత్రిగాడి మాటకన్న విలువుందేమో కాని. ఈదేశపు మంత్రులమాటకువిలువేముంది? ఈ అవకాశవాదులూ, స్వార్థపరులేగా మన ఈ దుర్మరణానికి మూలం. (వెంకటేశం వచ్చాడు)

వెంక : యివ్వాళ నాకు తీరికవుండదు. అవతల మానాన్నకు జబ్బు ఎక్కువైయింది. యివ్వాళా ప్రెస్‌లాకప్ చేసినందు

లకు బైఠాయింపుసమ్మె చేస్తున్నాం. నాకోసం నువ్వు కూ రోచ్చకు, భోజనం ఏర్పాటులన్నీ చేసి వచ్చాను. తప్పక యింటికివెళ్ళాలి. నేను వెళ్ళుతున్నాను.

విశ్వ : యివ్వాళ నాకు ఆకలి కావటంలేదు

వెంక : రాత్రిగూడా భోజనంచేయలేదుగా? యిట్లు అధైర్యపడితే బ్రతకలేం

విశ్వ : సరేలే! వెళ్ళు.

వెంక : వెళ్తున్నాను. (వెళ్ళాడు)

కాంతా : చూడరా ఆకుర్రవాడికి జీవితంమీద ఎంత నమ్మకం వుందో! కష్టాల్ని ఎదిరించి అన్యాయాల్ని ప్రతిఘటించి హక్కుల్ని సాధించుకుంటున్నాడు. తన జీవితానికి తానే రాచబాట వేసుకుంటున్నాడు. ఈ రోజున అంతా అలా చెయ్యకపోతే బ్రతకలేరుగూడాను. కాని మన మిడిల్ క్లాస్ కే వచ్చింది పెద్దచిక్కు.

విశ్వ : చస్తే ఏచిక్కులూ వుండవు.

కాంతా : కొంపదీసి ఏదన్నా అఘాయిత్యం తలపెట్టావేమిటి?

విశ్వ : అదే ఆలోచిస్తున్నాను.

కాంతా : సరేలే! పిచ్చివేషాలు వేయక. వెళ్ళి భోంచేసి హాయిగా నిద్రపో! నేను యివ్వాళ అర్జంటుగా విజయవాడ వెళ్ళుతున్నాను. యిప్పుడే శాస్త్రి దగ్గరకెళ్ళి వస్తాను. సరేనా! (వెళ్ళిపోయాడు. విశ్వనాథం తలపట్టుకుని కూలబడ్డాడు)

(యింతలో భూపయ్య వచ్చాడు)

భూష : ఏందయ్యా నన్నుచూడగానే మొదలుపెట్టినా తల పట్టుకోవటం ? నాబాకీ సంగతి ఏంజేసినా ? తేల్చిచెప్పు ! నీకోసం తిరగలేక నాచావు కొచ్చింది గదయ్యా !

విశ్వ : నీచావుగాదు. నాచావుకే వచ్చింది.

భూష : అట్లా బెదిరిస్తే నేను యిడిచిపోతాననిగదో నీ ఆలోచన. యిదంతా వదిలేసి నాడబ్బుతేల్చయ్యా ! ఏంది నీకు చీమకుట్టినట్టుగానీ లేదేం అంట ?

విశ్వ : భూషయ్యా ! యిప్పుడు నీబాకీ యివ్వలేను.

భూష : ఆయేదుపు తెచ్చేనాడేవుంటే దేనికొస్తాందికష్టం. ఛీ. యదవనాయాల బాకీలు నీలాంటి గతిలేనాళ్ళకు పెట్టి నాయాపారం అంతా పాడుచేసుకుంటినిగదయ్యా ! అదంతా చెల్లదుగాని నాడబ్బు యిచ్చి కదులు. నాకు తెలియకడుగుతాలే ! అంతయియ్యలేనోడివి దేనికి బాకీలు చేయాల్నంట ? నేనుగని నీకు బాకీ వుండానుగనేంది ?

విశ్వ : (పలుకడు)

భూష : ఏందిఅట్ల గుడ్లిచిపెట్టి చూస్తేనేను జాలిపడుతా నాను కొంటుండా? అదేంలేదయ్యో: యిస్తివా మర్యాదగా యియ్యి. లేదా: బొగ్గులబస్తాకు కట్టేయకపోతే నాపేరు భూషయ్యను పిలవమాకు. తెలిసిందాఅంట! మల్లీచెపుతుండా ఆప్పాటికి నాడబ్బు నాకియ్యాల. లేకపోతే మరి. నాచేతిరుచి చూస్తావు చెపుతుండాను. బాగా ఆలోచించి మరీనడుచుకో:

(వెళ్ళాడు విసురుగా. యింతలో టెలిగ్రాం తీసుకొని పోస్టుమేన్ వచ్చాడు)

పోస్టు : సార్ ? టెలిగ్రాం

విశ్వ : నాకేనా !

పోస్టు : యిదిగో! ఈ నెంబరు దగ్గర సంతకం పెట్టి తీసుకో?

(సంతకం పెట్టి తీసుకున్నాడు వణుకుతున్న చేతులతో కవరుచించాడు)

ఆత్మహత్యవల్లఅన్నపూయ చనిపోయింది. త్వరగా రావలసింది

విశ్వ : అనూ...అనూ. (మంచంమీద తూలిపడిపోయాడు దుఃఖంతో)

(తెరలో పాట వినిపించింది)

అంధకారమా లోకం
గాఢాంధకారమా లోకం
అన్నా !............
ఆకలితో ఆర్చి ఆర్చి
బ్రతుకు బరువుమోయలేక
అవమానపు విష కోరల
ఆహుతే అయితివా ?
అభాగ్యుని జేసితివా ?
దారిద్ర్యం పెనవేసిన
ఈ దైన్యపు ఈ జీవితాన
దారుణరౌరవ నరకం
తుదకీరీతిని తెల్లవారిపోయెనా ?
అడియాశలు కూలెనూ ?
అంధకారమా లోకం
గాఢాంధకారమా లోకం

(పాట అయిపోయింది. విశ్వనాథం కన్నీటితో మునిగిపోయాడు. తెరలో అనేకగొంతులు మార్మోగాయి)

అన్న : పుట్టెడు దుఃఖాన్ని నెత్తిన వేసుకుని పుట్టింటికి వచ్చాను నలుగురూ నవ్వుతున్నారు. నన్ను నవ్వులపాలు చేయకండి!

శాస్త్రి : నీడుచస్తే లోకం తరిగిపోతుందనుకున్నావా? వీడిని కట్టుకున్నందుకు వీడి ప్రాణానికి ఉసూరుమంటూ ఏడుస్తూ వుందా యిల్లాలు.

భూష : ఏందయ్యా అంత చీము నెత్తురూ లేకుండా బ్రతుకుతుండా. సాయంకాలానికి నాడబ్బు యియ్యకపోతే బూడ్లో చెయ్యేసి నడిరోడ్లో నిలవేస్తానుగదో!

పేర : నాయింటద్దె యిచ్చి యింటితాళం తీసుకో! లేకపోతే యిల్లు కాళీచేయి అంతే...

(విశ్వనాథం చెవుల్లో ఈ మాటలు గింగురుమంటున్న వాడిలాగా బాధపడుతూ వణకిపోతూవుంటాడు. చివరకు పెద్దగా నవ్వి ఏడుస్తాడు. తల పీక్కుంటాడు. మళ్ళీ ఏడుస్తాడు. మళ్ళీ నవ్వుతాడు.)

విశ్వ : (దుఃఖంతో) అనూ చచ్చిపోయావా? చచ్చిపోయావా! అనూ! అనూ!

(పెద్దగా అరుస్తూ పిచ్చివాడిలాగా పరుగెత్తాడు)

(బయట తెరలో విషాదమైన సంగీతంతో పాట వినిపించింది వెంకటేశం. కాంతారావు వచ్చారు. టెలిగ్రాం చదువుతున్నారు. ముఖాలు కందిపోయినై. దుఃఖంతో వెంకటేశం)

వెంక : అక్కా... (అంటూ కూలబడ్డాడు)

—( తెర పడింది )—

సమాప్తం.





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA112B117 |
| పుస్తకం పేరు | నిరుద్యోగి |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 2 |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | thasin |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |